# శ్రీ వాసవీకన్యక

( కన్యకా పురాణము )

రచయిత :

శ్రీ లింగా నాగభూషణం గుప్త

: ప్రకాశకు

చందా నారాయణ శ్రేష్ఠి
పుస్తకముల వ్యాపారము,
జనరల్ బజార్ సికిందరాబా[దు]
కాపీరైట్ 1958 వెల [illegible]

# అంకితము

సీ. పతిహితాచరణయై పతివ్రతా రత్నమై
బరగిన శ్రీ మాతృచరణములకు ;
నవమాసములు మోసి నన్ గాంచి పెంచియు
స్వర్గీయ యౌ మాతృచరణములకు ;
నా మేలు వాంఛించి న న్నింతవానిగా
సల్పిన శ్రీ మాతృచరణములకు ;
కులమువా రందఱు కోవిదురా లని
పాటిన శ్రీ మాతృచరణములకు ;

గీ. "రాజమణి" నామమున ఇల ప్రతిభగొన్న
జనని చరణంబులకు పూజ సల్పి, భక్తి
నంకితం బిత్తు ; మా అమ్మఆత్మ శాంతి
నందు, ఈ దివ్యమౌ కృతిని అందముగను॥

ఇట్లు
రచయిత



రచయిత:— శ్రీ లింగా నాగభూషణం గుప్త.

# తొలిపలుకు

మన పూర్వుల చరిత్రములు ప్రతివారు తెలుసుకొనుట అత్యావసరము. అందుచే ఆర్యవైశ్యుల పుట్టు పూర్వోత్తరములు సవిస్తరముగా తెలుసుకొనుటకుగాను యీ పుస్తకమును రచించి యిందులో ఆర్యవైశ్య కులధర్మములు, వారికి కలిగిన శాపములు, విమోచనములు, శ్రీ వాసవీ కన్యక 'పెనుగొండ పట్టణమున జనించుటయు'

విష్ణువర్ధన మహారాజు ఆమెను వరించి తన కిచ్చి వివాహ మొనరిం చుమని కోరుటయు, ఆమె అగ్నిగుండములో ప్రవేశించుటయు, విష్ణువర్ధనుని పూర్వజన్మ చరిత్రమును, ఆర్యవైశ్యపుంగవులయొక్క 102 గోత్రములవారి త్యాగమున్ను నా నేర్చిన ప్రకారముగా జొప్పించితిని.

ఆబాలగోపాలమునకు సవిస్తరముగా తెలియుటకై భాషయు సాధ్యమైనంతవరకు సులభశైలిలో వ్రాయడమైనది. దీనిపై ప్రతి వారును ఆదరాభిమానమును జూపి ఆసక్తితో చదువుదు రనియు, శ్రీ కన్యకాపరమేశ్వరి యొక్క కృపకు పాత్రులై మెలగుదు రనియు, నా యీ కృషిని ఫలవంతము జేయుదురనియు ఆశించుచున్నాను.

ఇట్టి పవిత్ర గ్రంథమును రచించి నా మిత్రులగు శ్రీ బూరెల సత్యనారాయణ మూర్తికి చూపించగా, వారు దీనిని చదివి సంతో షించి నేను వ్రాసిన దానికి మెరుగు పెట్టి సవరించి ఇచ్చిరి. అట్టి నా మిత్రులకు ధన్యవాదము లర్పించుచున్నాను.

ఆర్య వైశ్య కులదేవత యగు శ్రీ కన్యకా పరమేశ్వరియందు గల భక్తితో దీనిని వ్రాయుటకు ప్రోత్సహించిన శ్రీయుత గుబ్బా జోగయ్యగుప్త గారికిని, సంపూర్ణ ఆదరాభిమానములు జూపి, ప్రచు రించి పాఠకులకు అందజేసిన ఆర్య వైశ్య వాణిజ్య ప్రముఖులు శ్రీ చందా నారాయణశ్రేష్ఠి, విద్యావిషయక ప్రచారకులు, సికిందరా బాదు వారికిని నా కృతజ్ఞతలు.

ఈ పవిత్రగ్రంథమును ఆదినుండి అంతమువరకు పఠించి తమ అమూల్యాభిప్రాయముల నొసగిన మహనీయుల కెల్లరకు నా నమోవాకములు.

సికిందరాబాదు
ది 15-4-1958

ఇట్లు
ర చ యి త.

భారతదేశమును దాస్య విముక్తినొనర్చిన
భారతీయ వైశ్యజాతి రత్నము.



మోహన్‌దాసు కరంచంద్ గాంధీ.

నిర్యాణము :— 30 - 1 - 1948

మూడుకోట్ల ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్ర అవతరణ
కొరకై అసువుల నర్పించిన ఆర్యవైశ్య అమరజ్యోతి



శ్రీ పొట్టి శ్రీరాములు

నిర్యాణము :— 15 - 12 - 1952

# అభిప్రాయములు

కొంకిమళ్ల చంద్రశేఖరం గుప్త,
అడ్వొకేట్

ఖమ్మంమెట్టు.
17-12-56

మిత్రులు అభిప్రాయమునకై పంపిన యీ సద్గ్రంథమును చదివి అభిప్రాయము వెలిబుచ్చుట కెంతయో సంతసించుచున్నాను. సులభశైలి, అతి మనోహరమగు ధోరణి, చదువరులకు శ్రద్ధా సక్తులు కలుగజేయు రచనయనుట నిస్సందేహము. దాదాపు తొమ్మిది వందల సంవత్సరములకు పూర్వము ప్రపంచ చరిత్రలో కని విని యెరుగనటువంటి విధానముతో స్వధర్మమునకై జాతి గౌరవ ప్రతిష్ఠలకై సామూహికముగా (౧౦౨) దంపతులు శ్రీకన్యకా పరమేశ్వరి యుక్తముగా ఆత్మార్పణ మొనర్చిన జాతి. యిదేరీతిగా దేశసముద్ధరణకై హిందూ ముస్లిం ఐక్యతకై గోడ్సె తుపాకిగుండుకు రొమ్మునొడ్డిన జాతి పిత పూజ్య బాపుజిని గన్న ధన్యజాతి. యింతే గాదు ముక్కోటి ఆంధ్రులముక్తికై సాటిలేని ప్రాయోపవేశమొనర్చి ఆంధ్రరాష్ట్ర సాధనకై అకుంఠిత దీక్షబూనిన అమరజీవి పొట్టి శ్రీరాములును బలిదానమొనర్చిన జాతి వైశ్యజాతి.

ఇట్టి పరమపవిత్రులైన త్యాగనిరతుల గన్న జాతి చరిత్ర పరికించినచో వీరు నిష్కారణముగా ధర్మరక్షణకై తహతహలాడి దురహంకారుల శాపమునకు గురిఅయినారని తేటతెల్లముకాగలదు. అప్పుడేకాదు; ఇప్పుడు కూడ యీజాతిని శాసన సభలలో సైతము బాధ్యతకలిగిన వ్యక్తులు పార్లమెంటు సాంప్రదాయమునకు విరుద్ధముగా జాతివిద్వేషము రగుల్కొలుపునట్లు "వైశ్యోవిశ్వాసఘాతుకః" అని సంబోధింతురు.

నిజముగా పరిశీలించినచో యిందుకు కారణ భూతులు విమర్శించిన మహానీయులే యగుదురనుట నిస్సందేహము. అయి

నను వారు తమతెలివితేటలచే తమ తప్పిదములను తప్పించుటకు అమాయకులైన ఇతరులపై అభాండముల వేయుచుందురు. యిట్టి అక్రమపరుల అభాండములకు వైశ్యాజాతి జంకక, ధర్మరక్షణ తమ ధ్యేయముగా పెట్టుకొని దేశచరిత్రలో స్వర్ణయుగముగా పేర్కొనబడిన "గుప్తరాజుల యుగము"ను దృష్టియందుంచుకొని వారి యడుగు జాడలలో నిర్మాణాత్మకమైన కృషియొనర్చినచో జాత్యాభివృద్ధి మరియు దేశాభివృద్ధియై ప్రజలు సస్య సంపదలచే తులదూగి యే లోటుపాటులు లేకుండా సుఖించెదరు. మరియు విమర్శనా పరులకు వైశ్యాజాతి త్యాగనిరతి, ఆత్మార్పణ, నిర్మాణాత్మక కార్య క్రమములు యిత్యాదులు జవాబు చెప్పగలవు.

కావున సోదరులు అభిమానులు ఇట్టి పరమపవిత్రమైన జాతిచరిత్రను బహిర్గతపరచు, యీ చిన్న పొత్తమును అదరించి గ్రంథకర్తకు ఉత్సాహముచేకూర్చెదరుగాక! మరియు పాఠశాలలలో పాఠ్యగ్రంథము కాగలదని ఆశించుచున్నాను.

ఇట్లు,
కొంకిమళ్ల చంద్రశేఖరం గుప్త



శ్రీ కవిచక్రవర్తి, శతావధాని, విద్వాన్,
దోమా వేంకట స్వామిగుప్త
6/113 పూలబావివీథి, విజయవాడ.

ఆర్యా ! నమస్కారములు.

తాము దయతోఁ బంపిన "శ్రీ వాసవీకన్యక" అనెడు నామాంతరముగల శ్రీ కన్యకా పురాణ సంగ్రహ గ్రంథప్రతి యందినది. యథావకాశముగా, స్థాలీపులాక న్యాయముగా దానిని చూచి బాగుగ నున్నదని యభిప్రాయ మొందినా నని మనవి చేయుచున్నాను

—దోమా వేంకటస్వామి గుప్త.

శ్రీ వేంకటేశాయ నమః

కవితాధార శిరోమణి :

## శ్రీమతి అర్వపల్లి సత్యవతీదేవి

ఖమ్మం మెట్

అన్నా !

తమ రత్యంతప్రేమతో వ్రాసి పంపిన, (శ్రీ వాసవి కన్యకా పురాణము అను) గ్రంథరాజము అమూలాగ్రముగా పఠించితిని. అందు వైశ్యుల గోత్రము, ఋషి, ప్రవర మున్నగునవి విపులీకరింపబడి గుప్తమై యున్న "గుప్త చరిత్ర" బహిర్గత మొనర్చి వైశ్యులెల్లరకును జాగృతి సంస్కారణ కలిగించునదిగా యున్నది. వైశ్యుల కైలాస నివాసము (స్వర్గలోక స్థానము), అమరత్వము ప్రజ్ఞాలక్షణములు, కుశాగ్రత (కుశాగ్రబుద్ధి), సరళమైన భాషతో చక్కగా విశదీకరింపబడినవి. వైశ్యోన్నతిని సుదృఢస్వరముతో "తల్లి శీలచరితము" యెలుగెత్తి చాటితిరి. అది ఒక వైశ్యవర్గమునకే కాదు. సర్వమానవలోకమునకు ఆదర్శమయమై, స్తుత్యర్హమై యున్న దనుట కెట్టి సందియమును యుండదు.

అంతేగాక, స్థూలదేహ సౌందర్యమును మోహించి తన దేహవాంఛితమును నెరవేర్చుకొనుట కొరకు ప్రేమించుట తామస ప్రేమ గాన, అట్టిప్రేమను తుచ్ఛముగ నెంచి అమరప్రేమను చాటుచు అమ్మయొక్క విజ్ఞానము, దైవత్వము కుసుమశ్రేష్ఠి నోములపంట మన పాలిట ముక్తికాంత యను చక్కగా నిరూ

పించుచు మాతృఋణవిముక్తి బడసిన సోదరుడవు. ధన్యుడవు. సదా శ్రీ వాసవాంబ రక్షించుగాక!

మాతృహృదయము శాంతించుగాక !

అ॥ సత్యవతీదేవి.

---

విద్వాన్,

వనమా వేంకట రమణ గుప్త,

ప్రధానాంధ్రోపధ్యాయులు,
శ్రీ శరభయ్యగుప్త హైందవోన్నతపాఠశాల
సత్తెనపల్లి. (గుంటూరు జిల్లా)

ఆర్యా ! నమస్కారములు.

మీరు దయతో 4-12-56 న అభిప్రాయార్థమై పంపిన వాసవి కన్యక అను గ్రంథము అందినది. శ్రీ లింగా నాగభూషణం గుప్త గారీ గ్రంథమును సులభశైలిలో రచించిరి. పెనుగొండవారు ప్రచురించిన పురాణమునకు చక్కని అనువాదము కావించిరి. అచ్చటచ్చట వ్యాకరణ విరుద్ధ ప్రయోగములు, దుస్సమాసములు ఉన్నను ఇది దేవీచరిత్ర మగుటచే ఆదరింపదగినది.

వనమా వేంకటరమణ గుప్త

---

సంఘోద్ధారక

ఎ. యన్. మూర్తి. యెం. ఎ. (న్యూయర్క్).

అత్యం బిల్డింగ్స్, మెయిన్ స్ట్రీట్, పాలకొల్లు,
పశ్చిమ గోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్.

ఆర్యా,

నమస్తే! నాయభిప్రాయము కొఱకై మీరు నాకంపిన "శ్రీ వాసవీకన్యక" చూడ ముచ్చటగ నున్నది. ముఖపత్రపు సోయగము చదుపరిని మొదటనే యాకర్షించుచున్నది. అచ్చుమెచ్చదగినదై యున్నది. కథా భాగములు రెండును గ్రాంథిక మైనను సులభశైలిని మధురముగ, రచయిత శ్రీ లింగా నాగభూషణం గుప్త గారిచే చెప్పబడినవి. ఆర్య వైశ్యులెల్లరును చదివి, గ్రహించి, యానందించ దగిన పుస్తక మిది.

ఎ. యన్. యమ్.

—oo—

ప్రొద్దుటూరి శ్రీరాములు

డిస్ట్రిక్టు సెషన్ జడ్జి, మహబూబ్ నగర్.

ఆర్యా!

నేను మీరు పంపిన "శ్రీ వాసవీకన్యక" అను చిన్న పుస్తకము మిక్కిలి శ్రద్ధతో చదివితిని. సామాన్య జనులకుకూడ దీనిని చదివి గ్రహించి, లాభము పొందునటుల శ్రీ లింగా నాగభూషణం గారు సులభశైలిలో వ్రాసియున్నారు. ఇది ప్రతి వైశ్యకులోద్భవుడు చదువ వలసిన గ్రంథ రాజము. వైశ్యులు తమపూర్వోన్నతి అఖండ త్యాగము, సద్గుణ గణములు, తపః సంపన్నత, విద్యావినయతలు మరచియున్న ఈ కాలములో, ఈగ్రంథ పఠనము మిక్కిలి

అవసరమై యున్నది. ఇటువంటి పుస్తకము ప్రతివైశ్య స్త్రీ పురుషుడు చదివి లాభము పొందగలరని నా ఆశ. ఈ పుస్తకము వ్రాసిన గ్రంథ కర్తకు, ప్రకాశకులకు నా అభివందనములు.

ఇట్లు
ప్రొద్దుటూరి శ్రీరాములు

---

## గోలకొండ పత్రిక

(గ్రంథ సమీక్ష)

శ్రీ వా స వి క న్య క : ది. 31-12-58
వెల : రు 1-4-0

రచన : శ్రీ లింగా నాగభూషణం గుప్త

ప్రకాశకులు : చందా నారాయణ శ్రేష్ఠి,
జనరల్ బజార్, సికిందరాబాదు.

సమాజంలో గల ప్రతి వర్గీయులకు తమతమ వర్గాల పుట్టుపూర్వోత్తరాలు, పూర్వచరిత్ర, తెలిసికొన వలెనను ఆపేక్ష ఉండుట సహజము. ఇందు వైశ్యుల పూర్వచరిత్ర, వారి కుల దేవత అగు కన్యకా పరమేశ్వరి (వాసవికన్య) గాథ పురాణఫోరణిలో వర్ణింపబడినది. వైశ్యుల కులధర్మాలు, వారి గోత్రాలవివరములు సవిస్తరముగా సరళమైన భాషలో వ్రాయబడినది. ఈ వర్గీయులు తమ పూర్వచరిత్రను తెలుసు కొనుటకు ఇది ఉపకరించుటయే కాక ఇతరులకు విజ్ఞానాత్మకముగా కూడ నుండగలదు.

# ఆంధ్ర జనత

## గ్రంథ సమీక్ష

శ్రీ వాసవి కన్యక : ది. 13-12-56

వెల : రు. 1-4-0

రచన : శ్రీ లింగా నాగభూషణం గుప్త

ప్రకాశకులు : చందా నారాయణ శ్రేష్ఠి
జనరల్ బజార్, సికింద్రాబాదు.

వాసవీ కన్యక—అంటే కన్యకాపరమేశ్వరి చరిత్ర చెప్పే యీగ్రంథానికి కన్యకా పురాణం అనికూడ పేరు ఉంది.

ఆర్యవైశ్యులకు కన్యకాపరమేశ్వరి ఇష్టదైవం, ఈ వచన గ్రంథములో ఆర్యవైశ్య కులధర్మములు, వారికగలిగిన శాపములు విమోచనములు, శ్రీవాసవీ కన్యక పెనుగొండ పట్టణమున పుట్టుట విష్ణువర్ధన మహారాజు ఆమెను వరించి తనకిచ్చి పెండ్లి చేయుమని కోరుట, వాసవీకన్య అగ్నిగుండములో ప్రవేశించుట, విష్ణువర్ధనుని పూర్వజన్మ చరిత్రము, ఆర్యవైశ్యుల 102 గోత్రములు, వారి త్యాగ భోగము విశేషములు ఉన్నాయి.

భాష అంత కఠినంగాలేదు. అందరికీ కథ అర్థం అయిపో తుంది. ముఖ్యముగా వైశ్యులకు పురాణ సమ్మతమైన వచన రచన కనుక వారందరూ దీనిని తప్పక ఆదరించి రచయితను ప్రోత్స హించడం సామాన్యమైన విషయం.

సంపాదకులు :

"వైశ్యమిత్ర"

ఆర్యా !

నమస్కారములు. మీరు దయతో అభిప్రాయార్థం పంపించిన "శ్రీ వాసవీకన్యక" యను పవిత్ర గ్రంథమును చదివితిని. శ్రీలింగా నాగభూషణం గుప్తగారు పెనుగొండ నగరమువారు ప్రచురించిన పురాణము ననుసరించి సామాన్య ప్రజలకుగూడ నర్థమగు సులభశైలిలో యీ గ్రంథమును వ్రాసిరి. వైశ్యకులమాత పవిత్ర గాథను సరళ భాషలో వచన కావ్యముగ రచించినందులకు శ్రీ గుప్తగారికిని, ప్రచురించిన మీకును నా ధన్యవాదములు.

సంస్కృత శ్లోకములతో నున్న బృహత్పురాణమును జదివి యర్థము జేసికొనుట కంటె, సంక్షిప్తముగను, సరళముగను వ్రాయబడి వైశ్యుల పూర్వపు టౌన్నత్యము, సంఘీభావము, త్యాగనిరతి, ధైర్యస్థైర్యముల నుద్ఘాటించు యీ గ్రంథము మిక్కలి యుపకరించును ఇందు ఋషి గోత్రములు, ప్రవరలు, సాంకేతిక గోత్రనామములు మొదలగు విషయములు విపులీకరించి వ్రాయబడినవి.

శ్రీ వాసవీమాత యగ్నిప్రవేశ దృశ్యము, పెనుగొండ నగర నగరేశ్వరాలయము, విష్ణువర్ధన మహారాజు పెండ్లికి తరలివచ్చుట మున్నగు దృశ్యములతో త్రివర్ణముఖ చిత్రము జూడ ముచ్చటగా

సున్నది. ఈ గ్రంథము ప్రతి సంఘీయుని యింట నుండదగినది. సంఘీయు లెల్లరె దీనిని యాదరింతురని యాశించుచున్నాను.

ఇట్లు

"సంఘసేవ పరాయణ"

తాడికొండ నరసింహామూర్తిగుప్త,

ఆర్గనైజర్

అఖిల భారత ఆర్యవైశ్య మహాసభ (రిజిష్టర్డు)

సహాయకార్యదర్శి

భారతీయ వైశ్య చారిత్రక పరిశోధన సమితి.

సంపాదకులు "వైశ్యమిత్ర"





ప్రకాశకులు

కీ॥ శే॥ చందా నారాయణ శ్రేష్ఠి

# శ్రీ వాసవీ కన్యక

## ( కన్యకా పురాణము )

—ooo—

## ప్రథమ భాగము

### కశ్యపాది మహర్షులు శౌనకమహాముని దర్శించుట.

శ్రీమన్నారాయణుని సృష్టిరచనా ప్రకాశితమగు నీ భూమండలమున, వింధ్యపర్వతమునకును - హిమాలయ పర్వతమునకును మధ్య పుణ్యభూమియగు ఆర్యావర్తము ప్రకాశించుచుండెను. అది దేవ, గంధర్వ, కిన్నర, కింపురుషాదులకు విహారభూమి యగుటచే మిక్కిలి పావనంబై యలరారుచుండెడిది. అట్టి యా ఆర్యావర్తమునందు, మహాత్ములయిన మునిగణములకు నివాస యోగ్యమయినదియు, బహువిధ పుష్ప-ఫల భరితమయిన వృక్ష రాజంబులచే నొప్పారు నైమిశారణ్యము సంశోభించుచుండెను.

పవిత్రవంతమైన యా నైమిశారణ్య మధ్యభాగమునం దాదికాలమున నొకానొకప్పుడు లోకసంరక్షణా దీక్షితులును, వేద వేదాంగ పారీణులును, మహర్షి పుంగవులును అగు కశ్యపుడు, వసిష్ఠుడు, వామదేవుడు, గౌతముడు, భరద్వాజుడు, మందపాలుడు మతంగుడు, మాండవ్యుడు, మార్కండేయుడు, గాలవుడు, సనక

సనందాదులు, అగస్త్యుడు, వాలఖిల్యుడు, మౌద్గల్యుడు, శాండి ల్యుడు, జాబాలి, దూర్వాసుడు, అంగీరసుడు, పరాశరుడు, శర భంగుడు, నారదుడు, వ్యాసుడు, శుకుడు, అత్రి, విశ్వామిత్రుడు, మైత్రేయుడు, శ్వేతకేతువు, కపిలుడు, చ్యవనుడు, శతానందుడు, ఉద్ధాలకుడు, జమదగ్ని మున్నగు మునిగణ మొక యాగమును గావించుచుండిరి.

ఆ యాగ పరిసమాప్తి తరుణమున నటకు సకల పురా ణేతిహాస దురంధరుడును, జటామకుట భూషితుడును, నిజప్రభా విరాజిత ప్రభాకర యశఃతేజుడును, సాక్షాత్ జగదీశ్వర స్వరూపు డును నగు శౌనకమహర్షి యరుదెంచినం జూచి, ఆ మునిగణంబు ప్రహర్షమానభావులై శౌనకునికి యెదురేగి దోడ్తెచ్చి, సగౌరవం బుగా పూజించి, సుఖాసీనునిగావించి యిట్లనిరి.

## శౌనక మహర్షిని మునిబృందము వైశ్యధర్మముల వివరించుమని ప్రార్థించుట.

ఓ మహాభాగా ! తమ వాక్సుధా ధారలచే పూర్వము మే మనేక కథల నాలించితిమి. సాంగోపాంగముగా అష్టాదశ పురా ణముల నెల్ల నాకళింపు గావించితివి. (అష్టాదశ పురాణము లనగా 1, విష్ణుపురాణము, 2. బ్రహ్మకైవర్త పురాణము, 3. బ్రాహ్మ్య పురాణము, 4. భాగవత పురాణము, 5. లైంగ్య పురాణము, 6. శైవ పురాణము, 7, నారద పురాణము, 8. వశిష్ఠపురాణము,

9. బ్రహ్మాండ పురాణము, 10. పద్మపురాణము, 11. మార్కం డేయ పురాణము, 12. ఆగ్నేయ పురాణము, 13, వరాహ పురాణము, 14. వామన పురాణము, 15. గరుడ పురాణము. 16. మత్స్య పురాణము, 17. కూర్మ పురాణము, 18, స్కాంధ పురాణము అనునవి.) స్కాంధపురాణము నందలి ఉత్తరకాండమున గల పాపసంహారములయిన కథలను వినిపించి కృతార్థుల గావించితిరి. ఇక నిప్పుడు మేము వైశ్యధర్మముల నెరుంగవలయు నని మిక్కిలి యుత్సుకతతో నున్నారము. కావున, ఓ మహాతపశ్శాలీ! మాయందు కరుణాంతరంగం బుంచి, వైశ్య ధర్మములను, వారి జననాద్వ్యాపారములును, భవిష్యద్వృత్తాంతంబును తెలియజేసి మమ్మానందింపజేయ కోరెదము" అని పలికిరి.

ఆ మునిబృందముయొక్క కోరిక విన్నవాడై శౌనక మహర్షి మిక్కిలి ప్రమోదమునొంది "మునిపుంగవులారా! ఇంత మాత్రమునకై మీరు న న్నిట్లు కొండాడవలయునా? మీరు సావధానమతులై నాలకించ గోరి యడుగుచుండగా నేను కాదనగలనా? నాకు తెలిసినంతవట్టుకు పరిపూర్ణముగా దెలియ జేయుదును ; ఆలకించు" డని పలికి యిట్లు వివరింపసాగెను.

ఓ మునిపుంగవులారా ! ఆలకించుడు. పవిత్రవంతమగు గోదావరీ తీరమునందు, బహువిధవృక్షములతో, వివిధపుష్ప భరితంబై, ఆనందభరితంబై ప్రకాశించుచుండెడి బ్రహ్మకుండ మను నది సమీపాశ్రమమున సాలంకాయన మహర్షి సుఖాసీనుడై

ఉండగా తీర్థయాత్రాభిలాషులై చనుదెంచిన కొందరు వైశ్య మునులు అచ్చోట కేతెంచి, సాలంకాయన మునిని దర్శించు కొనిరి. తరువాత వారు ఆ మునిపుంగవునితో తగురీతి సత్కరింప బడి యా మునిపుంగవు నిట్లు ప్రార్థించుకొనిరి.

ఓ పురాణేతిహాస ప్రవీణా ! మాకు చాలకాలమునుండి యొకకోరిక కలదు. భూత భవిష్యద్వర్తమానశీలురగు తమవలన మా కోరిక యీడేరగలదని కొండంతయాశతో నున్నారము. మరియు, మే మట్టితలంపుతోనే బయలుదేరి తీర్థయాత్రలు చేసి కొనుచు, పాతక నివారణంబగు గంగానది మొదలగు పుణ్యతీర్థ ముల దోగి, మహాత్ములగు పెక్కుమంది మునిపుంగవుల దర్శిం చుచు క్రమక్రమముగా మీ పాదసన్నిధికి చేరుకొంటిమి ; మా జన్మంబులు పవిత్రములాయె ననియును ముదము నందుచుంటిమి. ఇంక మా కోరిక దెలియబరచుకొందుము. ఆలించి మమ్ము కృతా ర్థుల గావింపుడు. అ దేమనగా, ఈ ప్రపంచములో మా వైశ్యులు ఏరీతిగా జననంబయిరి ? మాయొక్క ధర్మాచరణ మెటువంటిది? ఏ విధముగా మా వంశము వృద్ధికి వచ్చినది ? గతించిపోయిన మా వైశ్యోన్నతి ఎటువంటిది ? ముం దే తీరున జరుగనున్నది ? ఈ విషయములపై మాకుగల సందియములు తొలగునట్లు తమరు పరిపూర్ణ కటాక్ష ముంచి వివరముగా తెలియజేయుదురని నమ్ము చున్నాము" అని పెక్కువిధములుగా కొనియాడగా, నా సాలం

కాయన మహర్షి మిక్కిలి ప్రమోద మంది వారల కిట్లు సమాధానము పలికెను.

వైశ్యమునిపుంగవులారా! మంచి వృత్తాంతమును గురించి నన్ను యడుగుచుండగా, నేను కాదనగలనా? ఈ మీ వైశ్య ధర్మముల నన్నిటిని పూర్వ మొక పర్యాయము ఒక మహా ముని ఆదిశేషునుచే నాలకించినవాడై - ఆతడు నాకు దెలియజేసెను. అట్టి మీ వైశ్యులయొక్క పుణ్యచారిత్రము మీకు నేను బోధించెదను. సావధానమతులై ఆలకించుడు - అని యిటు చెప్పసాగెను.



# ధర్మనందనుని కథాప్రారంభము

ఓ వైశ్య మునిపుంగవులారా ! పూర్వము నర్మదానదీ పరిసరములందు పుణ్యస్థల మని పేరుగాంచినదై ప్రతిష్ఠానపురమను నొక పట్టణము గలదు. అయ్యది నానా విధ తరు లతా సమూహంబయిన పూతోటలతోడను, మిన్నంటెడి సౌధరాజంబులతోడను, చక్కని రాజమార్గములతోడను ప్రకాశించుచు నాటి పట్టణములకెల్ల మిన్నయై యుండెను. ఆ పట్టణమున బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను చతుర్వర్ణంబులవారును, తమతమ ధర్మములను విడనాడక నీతివర్తనులై జీవితముల బుచ్చుచుండిరి.

ఆ చతుర్వర్ణములలో నొకటియగు వైశ్యజాతిలో, చుక్కలలో చంద్రునివలె ధర్ముం డను నొక వైశ్య శిఖామణి, మణివోలె జాతి కంతటికిని ఖ్యాతి నార్జించినవాడై యుండెను, ఆతడు మిక్కిలి బుద్ధిమంతుడై సత్య సంధుడును, ధార్మికుడునై ప్రకాశించెను. బ్రాహ్మణ పూజా ధురంధరుడై, సచ్చరిత్రుడై, దీనులకు కామధేనువువలె వెలుంగుచుండెను. ఆతని ధర్మపత్నియు నాతని కన్ని విధముల నీడై పతివ్రతా శిరోమణియై యుండెను. అష్టైశ్వర్యములును గలవు. "లేనిది, కానిది" యనునదియే లేదు. కాని, వారికి లోటున్నదెల్ల యొక సంతానమే. సంతానమునకై వారు నోమరాని నోములు నోచిరి ; చేయరాని చెప్పలేనన్ని వ్రతములు సల్పిరి, నూతులు తటాకములు పెక్కు త్రవ్వించిరి. గుళ్లు గోపు

రములు నిర్మింపజేసిరి. ఇక దానధర్మములకు చెప్ప నలవియే లేదు. అయినను వారికోరిక నెరవేరలేదు.

ఇట్లుండ, నొకసారి వారి యదృష్టదేవత యనదగు నొక వృద్ధవైశ్యుడు యాత్రలు జేయుచు నచ్చటికి వచ్చి, ధర్మునిచే నాదరింపబడినవాడై ధర్ముని యాదరణంబునకు మిక్కిలి సంత సించి, వారి సంతానచింత నెరింగి, ధర్ముని జూచి "ఓ మహా దాతా! సంతానలేమికి విచారింపబోకుము. ఎంతటివారికిని కర్మము పరిపక్వము కానిదే నేదియును జరుగనేరదు. నీ కిప్పటికి పరి పూర్ణస్థితి గలిగినదని నేను నమ్ముచున్నాను. ఎట్లనెదవేమో! ఆలకించుము. నేను తీర్థయాత్రలను సేవించుచు తుదకు యమునా నదీతీరము చేరుకొంటిని. అక్కడ పదునైదు దినములు గడిపి తిని. ఆ తీరప్రాంత మందలి నొక యాశ్రమ మందు భూమిం జయు డను భూసురోత్తముడు విష్ణుసేవాధురంధరుడై అలరారు చుండెను. ఆతని కృపాలేశ మాత్రమున పెక్కుమంది సంతాన హీనులు సంతానవంతులై సుఖముగా నున్నవారట! నేను కూడ నా పదునైదు దినములలో పెక్కుమంది ఆ మహాత్ముని యను గ్రహము నొందినవారిని జూచితిని. కావున నీవు విచారింపక, ప్రసన్నుడవై ధీరచిత్తముతో పత్నీసమేతుడవై యరిగి, ఆమహా మహుని ఆశ్రయింపుము. మీ కోరిక తప్పక నెరవేరగలదు" అని పలికి, ఆ పుణ్యదంపతులను "ఇష్టార్థసిద్ధి నొందుదురుగాక" అని దీవించి వెడలిపోయెను.

వైశ్యాగ్రణి యగు నా ధర్మదును, ఆతని సతియు ఆ ముదుసలి వైశ్యపుంగవుని వాక్యములకు మిక్కిలి సంతసించి యా మరునాడె, తగురీతి కానుకలతో నా భూమింజయు డున్న పుణ్యతీరమగు యమునా నదీతీరమున జేరి, అ మ్మహాత్ముని దర్శించుకొనిరి. పిమ్మట తాము వెంటగొనివచ్చిన కానుకలను సమర్పించుకొని, ఆ మహాత్ముని యానందపరచి "మహాత్మా! మీ గురించి చాలగా వినియున్నాడను. కల్పతరువురీతి తాము చనుదెంచిన శరణాగతుల మనోభీష్టముల నెరవేర్చుచుండిరని లోక ప్రసిద్ధి. కావున, సంతానహీనుల మగు మాపై తమ సత్కృపా రసమును వెదజల్లుడు. మేముకూడ సంతానవంతుల మగుటకు తగినమార్గమును దెలియజేయుడు" అని పెక్కు విధముల ప్రార్థించుకొనిరి.

భూసురోత్తముడగు నా భూమింజయుడు ఆ పుణ్య దంపతులయందు ప్రసన్నుడై వైశ్యకులభూషణా! మీ యనన్యమగు సేవకు మిక్కిలి నే నానందించితిని. వంశోద్ధారకుడగు మీకొక్క కుమారుం డుద్భవించు తెరంగు దెల్పెదను. మీ రా పద్ధతిని నియమంబున, శుచిర్భూతులై ఆచరింపుడు; మీ కోరిక దీరగలదు. అదెట్లనగా, మీ రుభయులును, నియతాహారులై రేపు వచ్చు కార్తీక శుద్ధ త్రయోదశి మొదలు సంవత్సరాంతమువరకు అనగా, ఫాల్గుణ మాసము బహుళపక్ష అంత్యమువఱకును గౌరీసమేతు

డగు నా పరమశివుని ప్రతిదినంబును ఏమఌక సంతానవాంఛా సక్తులై పూజ నొనర్పుడు. అందువలన తప్పక మీ కా అదిదం పతుల కరుణారసంబు వలన పుత్రోదయము కాగలదు" అని బోధించి వారల కొక ఉమాశంకర స్తోత్ర యుక్తమగు మంత్ర మును బోధించి ఆశీర్వదించి వారి తావులకు వీడ్కొల్పెను.

## ధర్మునకు పుత్రోదయ మగుట

ధర్ముం డిట్లు భార్యాయుక్తుండై భూసురోత్తముని ఆశీర్వా దము పడసి, నిజగృహంబునకు చనుదెంచి భార్యా సమేతుండై కార్తీక శుద్ధ త్రయోదశినాడు శుచిర్భూతులై శ్రీ గౌరీసమేతుండ యిన ఉమానాథుని పూజింప మొదలు పెట్టెను. ఇట్లు మిక్కిలి విశ్వాసముతో, భయభక్తులతో, నిష్ఠతో ప్రతిదినము చేయుచున్న అతని పూజలకు పార్వతీ నాథుడు కడుంగడు సంతోషించెను. అంత సంవత్సరాంత్యమున, నొకనాడు శ్రీ గౌరీనాథుడు ఆ పుణ్య దంపతులకు స్వప్నమున సాక్షాత్కరించి, "మీకు సద్గుణ నిధియుఁ వైశ్య కులమణియు, ధార్మికుడును అగు నొక్క పుత్రరత్నం బుదయించగల" దని యాశీర్వదించి అదృశ్యం డయ్యెను.

తరువాత కొన్ని దినంబులకే వైశ్యకులమణి యగు నా ధర్ముని యిల్లాలు గర్భవతి అయ్యెను. క్రమక్రమంబుగా నామెకు నవమాసములు నిండినవి. ఒక శుభ సుముహూర్తమునందు గ్రహ ములు అన్నియు మంచి స్థానములలో ఉండగా, ఆ సతీమతల్లి ప్రసవించి యొక పుత్రరత్నమును గనెను. అప్పుడు మింటనుండి

కుసుమవర్షము (పూల వాన) కురిసినది. అంత ధర్ముడు పుత్రోద యమునకు నిర్భరానందచిత్తము గలవాడై - ఆ వేడుకసమయము నందు పెక్కుమంది బ్రాహ్మణపుంగవులకు కోరిన దానములొసగి సంతృప్తి పఱచెను.

ఆ బాలుడును శుక్లపక్షపు పున్నమీ చంద్రునివలె దిన దిన ప్రవర్ధమానుడై పదునొకండు దినములు గడపెను. అప్పుడు తండ్రియగు ధర్ముడు నిర్భరానందకందళితుడై నామకరణ మహోత్సవము గావింప నిశ్చయించుకొని, ఆ వేడుకకు అహూతులయిన విప్రబృందము నుద్దేశించి "ఓ బ్రాహ్మణోత్తములారా! ఈబాలునకు జాతక లగ్నంబు ననుసరించి నామంబు బెట్టగోరుచున్నాను" అని వేడుకొనెను, వారును బాగుగ లగ్నం బుపలక్షించి, ఆ బాలునకు "ధర్మనందనుడు" అను నామము నుంచిరి. పిమ్మట నా శుభసమయంబున ధర్ముండు, నామకరణ మహోత్సవమునకు విచ్చేసిన బంధుకోటినే కాక, తదితరులను గూడ మిక్కిలి తృప్తి పఱచెను.

## ధర్మనందనుని విద్యాభ్యాసము

క్రమము ధర్మనందనుడు దినదినమున బెరిగి పండ్రెండేండ్ల ప్రాయము వాడయ్యెను. అప్పుడు తండ్రి ఆ బాలునకు ఉపనయనము గావించి, వేదవేదాంగ పారంగతుడయిన భార్గవ మహాముని కడ విద్యాభ్యాసమునకై అప్పగించెను.

## ప్రథమ భాగము

ధర్మనందనుడును తండ్రి యాజ్ఞానుసారముగా భార్గవ మునివద్ద భయభక్తులు గలిగి, వినయపూరితుడై భక్తిశ్రద్ధలతో శుశ్రూషల గావింపుచు, వేదవేదాంగములనెల్ల పఠించుచు, గురువు గారి మదికి మిక్కిలి ప్రేమపాత్రుండై ఋగ్యజుస్సామవేదంబు లలో మిక్కిలి ప్రవీణుండాయెను.

ఇట్లుండ ఒకనాడు భార్గవముని ధర్మనందనుని గాంచి "నాయనా! నీవు నాకడగల అన్నివిద్యలయందును పరిపూర్ణుడ వైతివి. ఇక నీవు నీ జననీ జనకులకడకు బోయి, వారి సేవలు, జేయుచు సుఖముగా నుండు" మని చెప్పెను. అందులకు ధర్మ నందనుడు గురువర్యుని గాంచి, "మహాత్మా! నా కింకను తమ సేవ జేయవలయుననెడి వాంఛ తీరలేదు. కావున నింకను కొన్ని యేండ్లవరకు నన్నిందుండ నిండు" అని మిక్కిలిభక్తితో ప్రార్థిం పగా, ఆ మహామునియు నాతని కోరికకు సమ్మతించెను.

## ధర్మనందనుడు కిరాతకునికి జిక్కుట

ఇట్లు కొంతకాలము జరిగినది. ఒకనాడు వాడుక ప్రకా రము ధర్మనందనుడు గురువుగారి పూజార్థము పుష్ప సంగ్రహము నకు సమీపారణ్య ప్రదేశములకు బోయెను. ఆనాడు మంచి పుష్ప జాతులు గోచరింపక పోవుటచే ధర్మనందను డందందు వెదకుచు పెక్కు దూరము వరకును బోయెను. అచ్చట నాతని హృదయ మున కింపయిన ఫలపుష్పములు గోచరించుటవలన నవి గ్రహించు

చుండెను. అంత నాతని కొకదిక్కునుండి "విడువుము ; నన్ను జంపకుము. బ్రాహ్మణ హత్యాపరాధము మహా ఘోరమైనది. నన్ను దయదలచి విడనాడుము" అని విన వచ్చెను.

ఆ యాక్రందనము వినినతోడనే ధర్మనందనుడు, వానిని రక్షింపదలచి, ఆ యార్తనాదము వినవచ్చిన దిక్కునుబట్టి పోయెను. "మానవసేవ మాధవసేవ" యని బుధజనోక్తి. సత్పురుషుల కెన్నడును సద్బుద్ధులే కలుగుచుండుట నైజముకదా ! అట్టి తలంపుతో వెళ్ళిన ధర్మనందనున కల్లంత దూరము పోవు సరికి, క్రూరాత్ముండగు ఒక కిరాతకుడు ఒక బ్రాహ్మణుని బంధించి లాగుకొని పోవుచుండుట గానిపించెను. భయగ్రస్తుడై బ్రాహ్మణుడు దీనారావము గావించుచుండెను. ఆ దృశ్యము తిలకించుసరికి ధర్మనందనుని లేత హృదయము మిక్కిలి కలవరము జెందెను.

అందువలన నాతడు మిక్కిలి వడిగ బరుగెత్తి కిరాతకుని సమీపించి యాతని వారించుచు, "ఓరీ ! పాపీ ! నిష్కారణముగ నీ బ్రాహ్మణుని ఏల హింసించెదవు ? పవిత్రమగు నీ వింధ్య పర్వత ప్రాంతమున కంతటికిని అపవిత్రము ఆపాదించుచున్నావు నామాట విని, యీ విప్రుని విడిచిపెట్టుము. నిష్కారణముగ నితని నేల జంపజూచెదవు ?" అని పలుకుచుండగా నా కిరాతకుడు గ్రుడ్లెఱ్ఱజేసి, "ఓహో ! వొకళ వీరాధి వీరునివలె నడ్డుపడుచుంటివే ! పొమ్ము, నీదారిని. లేదేని యీతనితోబాటు నీవును

మరణింపగలవు. బాలుడవుగాన దయదలచి చెప్పుచుంటిని. ప్రాణముమీద తీపిగలదేని కాళ్ళకు బుద్ధిచెప్పుము. లేదేని యీతనితోపాటు నిన్నును, నా యిష్టదేవతయగు దేవికి బలిగా జేసివైతును" అని పలికెను.

అందులకు ధర్మనందనుడు భయము నొందక, ఎట్లయినను నా పుడమీశునికి ప్రాణదానంబు గావింప నెంచి "కిరాతకా! ఈ బ్రాహ్మణుడు మిక్కిలి చింతించుచున్నాడు. ఈయనను విడిచిపెట్టుము. నీ యిష్టదేవతకు, నీ మనోరథం బీడేరుటకు నన్ను బలిగా గొనిపోయినను ఈ విప్రుని మాత్రము రక్షింము" అని పలుకగా నా కిరాతకుడు, కొంతతడ వాలోచించి యందులకు సమ్మతించెను. అందువలన నా క్రూరాత్ముడగు కిరాతకుడు విప్రుని విడిచిపుచ్చి, ధర్మనందనుని దయమాలినవాడై చేతులు బంధించి పశువును లాగుకొని పోవునట్లుగా, ఈడ్చుకొని పోసాగెను.

అప్పటికి మిట్టమధ్యాహ్న మగుటవలన నెండ మహాతీవ్రముగా నుండెను. ధర్మనందను డిట్లు కిరాతకునిచే బంధింపబడినవాడై వాని వెన్నంటి పోవుచుండుటవలనను, ఎండ వలనను, ఎన్నడు కష్టముల కోర్చియుండని కారణము వలనను మిక్కిలి అలసట జెంది – ముందున కడుగు బెట్టనేరక, సత్యమునకు బద్ధుడై యట్లే పోవుచు, పోవుచు నొకచో కూలబడిపోయెను. అయినను నా కిరాతకుడు దయా దాక్షిణ్యములను విడనాడి ఈడ్చుకొని పోసాగెను.

## కిరాతకుని మరణము

ధర్మనందనుడును సత్యవాక్పరి పాలనా శీలియై, హృదయమున గురువుగారిని దలంచుకొనుచు, వాని ఈడ్పులకు శరీరము నుండి రక్తధారలు స్రవించుచున్నను లెక్కజేయక, బాధను వ్యక్తీకరింపకయే పోవుచుండెను. అంతలో వారికి కొలదిదూరము నుండి గుఱ్ఱముల చప్పుడు వినిపించెను. అంత కిరాతకుడు ఆ వచ్చుచున్న గుఱ్ఱపు దండును గమనించి "ఎవరో రాజువలె నున్నాడు. సైన్యము సిబ్బంది యెక్కువగ నున్నది. ఈ స్థితిలో వారుగాని నన్ను జూచిన మోసము సంభవింపగలదు" అని తలంచి ఆ సమీపమునగల ఒక గుహలో ధర్మనందనుని పడ నెట్టి, దానికి అడ్డముగా నొక పెద్దబండను ఉంచి, సమీపముననే గల యొక వృక్షము నెక్కి దాగుకొనెను.

కిరాతకు డూహించిన ట్లది యొక రాజసైన్యమే. మగధ దేశపురాజు దిగ్విజయార్థము బయలుదేరి వచ్చుచుండెను. క్రమముగా ఆ సైన్యములు కిరాతకుడు దాగియున్న వృక్ష సమీపమునకు వచ్చెను. అప్పు డా మగధాధిపతి గజారూఢుడై పోవుచు పోవుచు, నేలనో శిరము పైకెత్తి వృక్షము దిక్కు జూచెను. ఆ చూపునకు భయగ్రస్తుడై వృక్షముపై నక్కియున్న కిరాతకుడు గోచరించెను. తోడనే రాజు ఆ స్థలము బందిపోటు దొంగలకు నిలయమైనది అగుటవలనను, వాని పరిస్థితిని గమనించి -

వాని నొక దొంగగా నిశ్చయించుకొని, చెంతగల వీరులను జూచి కిరాతకుని జూపి, "వానిని బంధించు" డని ఆజ్ఞ నొసగెను. వారును ఆతని బంధింపబోవుసరికి కిరాతకుడు చెట్టునుండి ఉఱికి పారిపోసాగెను. కాని, సముద్రమువలె నున్న ఆ సైన్యము ముందట వాని పాచిక పారలేదు. కొందఱు భటులు వానిని బట్టి దొంగగా నిశ్చయించి క్రూరముగా వానిని జంపివైచిరి. పిదప, ఆ రాజసైన్యములు తమ దిక్కునకు తాము తర్లిపోయినవి.

## ధర్మనందనునికొఱకై గురువుగారును, తలిదండ్రులును విచారించుట.

ఫలపుష్ప సంగ్రహణార్థమై వనాంతరములకు బోయిన ధర్మనందనుడు రాత్రివరకు నాశ్రమమునకు రాకపోవుటచే గురువుగారికి చాల కంపరము బయలుదేరినది. "ఆతని తోటివారందరు వారివారి పనులనుండి ఆశ్రమమున కేతెంచిరి. ధర్మనందను డేల రాలేదు ? ఏమయ్యెను ?" అని భార్గవ మహాముని మిగుల విచారము నొంది శిష్య బృందమును వానిని వెదకుటకై నలుదిక్కులకును బంపించెను. ఆ శిష్యులును ధర్మనందనునికొరకై సమీపారణ్యము నంతయు గాలించి తిరిగివచ్చి "ధర్మనందనుడు గనుపించలే" దని గురువుగారికి మనవి జేసికొనిరి.

అప్పుడు భార్గవముని "తలిదండ్రుల జూచుటకుగాని బోయెనా ?" అని తలంచి, ఎందులకయినను మంచి దని యీ

వార్త ధర్మనందనుని తలిదండ్రుల కెఱుకజేయించెను. వారును కుమారుడు గనిపించుటలే దనువార్త విని నతోడనే శోకార్ణవమున మునుగుచు వడివడి చనుదెంచి ఆశ్రమమునకు చేరుకొనిరి. భార్గవముని వారిని ఓదార్పబోయెను. కాని, కన్నకడుపుగదా! అందున లేకలేక గలిగిన నోముల పంట; సద్గుణనిధి; వంశాంకురము. అందుచే వారు బిట్టు మొరపిల్లుచు నిట్లు దుఃఖింపసాగిరి.

"కుమారా! ధర్మనందనా? ఏమైపోయితివి? ఎక్కడనుంటివి? ఏస్థితిలో నుంటివి? నిన్ను విడిచి మే మెట్లు బ్రతుకగలము? ఓ మా బంగారుపాపా! నీ దివ్యసుందర విగ్రహమును గనక మేముమాత్రము జీవించి యేమిలాభము? ఓ పరమేశ్వరా! ఏల మాకీ పుత్రవియోగము కలిగించితివి? ఓశంకరా! పాపభయంకరా! భక్తవశంకరా! ఓ మహాదేవా! గౌరీపతీ! జగత్పతీ! నిన్నే మనసార నమ్ముకొనియున్న మా కీ చింత గలిగించుట పాడియేనా? నిన్ను వినా యితరులను మేము కలలో గూడ నమ్ముకొనలేదే! అట్టిచో మా కీ దుర్గతి నేల కలిగించితివి? నీ దయారసంబువలననే మా కా పుత్రరత్నము జనించెను. ఇంతలోననే దయ తప్పినదా? మేమీ వియోగమును భరింపజాలము. మా యందు పరిపూర్ణానుగ్రహముంచి, పుత్ర సంయోగమును గల్గించుము. లేదేని మా ప్రాణములను గైకొని మా కీ చెఱ దొలగింపుము" అని పెక్కుభంగుల విలపించుచు, భగవంతుని ప్రార్థింపసాగిరి.

చ॥ జయ జయ సాధురక్షణ వి
చార విచక్షణ సారసేక్షణా!
జయ జయ సర్వకారణ ని
శాచర దారణకృన్మహోరణా!
జయ జయ సత్యభావన, సు
జన్య శుభావన లోకపావనా!
జయ జయ మంజుభాషణ! అ
సత్కులభూషణ! దీనపోషణా!
గీ॥ శిష్టజన రక్షణము దుష్టశిక్షణంబు
నవని నొనరించుకొఱకు నీ వవతరింతు
వంచు సూరులు బొగడుదు రంబ ప్రాణ
లోల! మా గోల వినరా వదేల? ఈశ!

ఇట్లు వారు పరమేశ్వరుని నుతించుచు, కన్న కుమారునికై విలపించుచుండగా, భార్గవమునియు వారికి పెక్కురీతుల సద్బోధలు గావించి, శాంతింపజేసి, శిష్యుడు ఆశ్రమమునకు తిరిగి వచ్చువఱకు నిరాహారదీక్ష గైకొన నిశ్చయించుకొని, ఒంటి కాలుపై నిలుచుండి తపము గావింపసాగెను.

## సర్పరాజుకడకు వాసుకి, ధర్మనందనుని నాగలోకమునకు తీసికొని పోవుట.

కిరాతకునిచే గుహలోనికి త్రోయబడిన ధర్మనందనుడు, నీరసించి యుండుటవలన, కిరాతకుని త్రోపునకు తట్టుకొనజాలక

అలసి మూర్ఛపోయెను. కొంత తడవునకు సేదదేరి, బయటకు వచ్చుటకు మార్గము గానక, లోనికి పోజాలక, ఏమిచేయుటకును తోచక, అందే కూర్చుండి, నిశ్చలభక్తితో గురువును ధ్యానించు కొనసాగెను.

ధర్మనందనుడు ఏ గుహాయందు త్రోయబడెనో, ఆ గుహ మార్గము నాగలోకమునకే మార్గము. అది కిరాతకునికిగాని, ధర్మ నందనునికిగాని, తదితరు లెవ్వరికిగాని తెలియదు. ధర్మనంద నుడు కిరాతకునిచే గుహలోనికి త్రోయబడిన మఱునాడు, ఈశ్వర కంఠహారమున నుండు ఫణిపుంగవుడగు వాసుకిసర్పము సర్పరా జాధిపతిని దర్శించు నుద్దేశముతో - పరమేశ్వరుని యనుజ్ఞ బడసి నాగలోకమునకు వచ్చుచు, ఆ గుహ వద్దకు వచ్చెను. కాని అది రాయిచే మూయబడి యుండుటవలన "నరు లెవ్వరో దీనిని మూసియుండవచ్చు" నను భావముతో, క్రోధము చెందినవాడై విషజ్వాలలు గ్రక్కి; ఆ రాతిని నుసినుసి గావించి, గుహలోనికి ప్రవేశించెను. అందు గురు పాదపద్మముల మదిలో దలంచుచు సమాధినిష్ఠలో నున్న ధర్మనందనుడు బ్రహ్మతేజముతో వాసుకి సర్పమునకు గోచరించెను.

ఆ బాలకుని గాంచినతోడనే వాసుకి మిక్కిలి ఆశ్చర్యము గలవాడై "ఈ బాలకుడు చూడగా మానవుడు. అయినను బ్రహ్మ తేజముతో ప్రకాశించుచు మిక్కిలి దీక్షాపరుడై యున్నవాడు. భగవత్సేవాధురంధరుడై యుండనోపు! కాదేని నాయొక్క విష

జ్వాలలో పడి మసిమసి కాకుండునా ? ఇతడు భగవద్భక్తుడు. కావుననే చలింపక యున్నవాడు. ఇంత చిఱుతప్రాయముననే ఈ పసిగందునకు ఏమి అవమానము, ఎటువంటి గొప్ప కష్టము సంభవించినదో ; ఏమో ! భక్త ధ్రువునివలె నీతడుకూడ మహా తపస్సమాధియం దున్నవాడు. ఇట్టి బాలుని చెనకుట నాశనము కొని తెచ్చికొనినట్లే'' అని భావించుకొని, ధర్మనందనుని సాదర ముగ వీక్షించి, తిన్నగ నా గుహద్వారము వెంబడి నాగలోకము నకు చేరుకొనెను.

తరువాత వాసుకి, అందున్న సర్పరాజును దర్శించి, పూజించి తాను వచ్చిన కార్యంబు నివేదించుకొని తిరిగి కైలాస మునకు పోవుటకు అతని యనుజ్ఞను కోరెను. సర్పరాజు వాసు కిని జూచి "అంత తొందరపడెదవేమి ? కొంతసేపు యిక్కడ గల యీ సత్పురుష సద్గోష్ఠి యందు పాల్గొని సంతసము నొం దుము" అని పలుకుచు, ప్రసంగవశమున "భూలోకపు వార్త లేమి ?" అని ప్రశ్నించెను.

వాసుకి యిట్లు బదులు పలికెను : "సర్పరాజా ! భూలోక మున నింకొక ధ్రువుడు బయలుదేరినట్లున్నాడు" అని తాను గుహలో కనుగొన్న ధర్మనందనుని గురించి తెలియజేసెను.

వాసుకి వాక్యములకు సర్పరాజు మిక్కిలి వెరగంది, "ఏమీ ! నీయొక్క విషజ్వాలలకుగూడ నోర్చికొనునంతటి శక్తి సంపన్నుడా యీ బాలకుడు ? అట్లయిన నత డొక గొప్ప

మహానుభావుడే యనవచ్చును. అత డచ్చటికి ఏ విధముగా వచ్చి యుండెనో తెలిసికొనవలయును. మఱియు నా బాలకుని నేను గూడ జూడవలయునని యున్నది" అని పలుకుచు, వాసుకిని జూచి "నీవు తగురీతి మనవారితో బోయి, ఆ బాలకుని యిచటికి తీసికొని ర"మ్మని పంపెను.

సర్పరాజానుమతిని వాసుకి కొంతమంది కులపెద్దలతో ధర్మనందను డున్న గుహకు వచ్చెను. అప్పటికి ధర్మనందనుడు శోషిల్లి పడియుండెను. అందువలన వాసుకి మంత్రం బొండు పఠించెను. దానితో ధర్మనందనుడు మరల జవసత్త్వములు గల వాడై, నేత్రములు విప్పి వాసుకి సర్పరాజాదులను గాంచి. నమస్కార మొనరించెను.

అప్పుడు వాసుకి ఆ బాలుని జూచి "నాయనా! నీ వెవరవు? నిబిడమై నిర్జనమై యలరు ఈ గుహలో పడి యుండుటకు కారణమేమి?" అని యడిగెను.

ధర్మనందను డప్పుడు తనయొక్క చరిత్రం బంతయు నివేదించుకొనెను. అందులకు వాసుకి మిక్కిలి సంతుష్టుడై "నీ యమోఘమైన త్యాగగుణము కడుంగడు వర్ణింప తగినది. నీ సంగతి మున్మందిటు పోయినప్పుడు నిన్ను చూచి యుండుటచే, మా సర్పరాజునకు తెలియజేసితిని. ఆయన నిన్ను చూడవలయునని మిక్కిలి కుతూహలపడుచున్నాడు. కావున మావెంట నాగలోకమునకు దయచేయు"మని విన్నవించెను.

కాని, ధర్మనందను డందులకు సమ్మతింపలేదు. "స్వామీ! నా యీ శరీరముపై నాకెట్టి బాధ్యతయును లేదు. ఇది కిరాతకుని కర్పించితిని. అతని యనుమతి లేనిది నేను వచ్చుట మహా పాతకము. కావున అతని నడుగుడు" అని పలికెను. వాసుకి యా బాలుని వచనంబులకు ముగ్ధుండై దివ్యదృష్టిచే కిరాతకుని మరణము నెఱింగి, "కుమారా! విచారింపకుము. నిన్ను గొనివచ్చిన కిరాతకుడు మగధరాజభటులచే సంహరింపబడినాడు, ఇక నీ కష్టములు తీరినట్లే. నా మాట విని సర్పరాజును దర్శించుకొనుము" అని పలికి ధర్మనందను నొప్పించి, అతనితో వాసుకి నాగలోకమునకు చేరుకొనెను.

ఇట్లు చనుదెంచిన ధర్మనందనుడు సర్పరాజును గాంచి, భక్తి శ్రద్ధలతో అనేక విధంబుల బొగడి, సాష్టాంగ వందనములాచరించెను. అంత నాఫణిరాజు మిక్కిలి సంతుష్టుడై అతని నాశీర్వదించి "నాయనా! ఇక నీ ఆశ్రమంబునకు వెడలుము. అచ్చట నీకై నీ తల్లిదండ్రులును, గురువగు భార్గవమహాముని యును మిక్కిలి కుందుచున్నారు. నీవు త్వరితగతిని బోయి వారికి ముదంబు గల్గింపుము. వివాహము కావించుకొని అష్టైశ్వర్యములు గల్గి సంసార యాత్రను సాగింపుము" అని బోధించి, ఆతదు వేగముగ ఆశ్రమమునకు చేరుటకుగాను ధర్మనందనునకు సర్పరాజాక మంత్రము నుపదేశించెను. ధర్మనందనుడు పరమానంద సర్పరాజుచే ఆ మంత్రం బుపదేశంబొంది, వినయపూర్వకముగా సర్పరాజు నిట్లు ప్రశ్నించెను.

## సర్పరాజు ధర్మనందనునకు - చతుర్వర్ణ సమాచారంబును, కలియుగ వృత్తాంతమును బోధించుట.

ఓ ఫణిరాజా! నాకొక సందియము కలదు. అది తమవంటి మహాత్ములద్వారానే తీరగలదని నమ్మి, మిమ్మడుగుచున్నాను. దయతో నా సందియమును బాపగోరెదను. అ దేమనగా:—

యుగంబుల పరిమాణంబును, బ్రహ్మమానంబు, మఱియు కలియుగమందలి చతుర్వర్ణజననంబును, వారి ధర్మంబులను సవిస్తరంబుగా దెలిపి కృతార్థునింజేయ వేడుచున్నాను" అని పలుకుటయు నా ఉరగపతి మిక్కిలి ఉల్లాసము నొంది ధర్మనందనున కిట్లు బోధించెను.

"ధర్మనందనా! చక్కగా ఆలకింపుము. కృతయుగ పరిమాణము 1728000 సంవత్సరములు, త్రేతాయుగ పరిమాణము 1296000 వత్సరములు, ద్వాపరయుగపరిమాణము 864000 వత్సరములు, కలియుగ పరిమాణము 432000 సంవత్సరములు. ఈ నాలుగు యుగంబులును ముగిసినచో, ఒక మహాయుగ మైనట్లు. ఇట్టి మహాయుగంబులు డెబ్బదియొకటి (71) యైనచో నొక మన్వంతర మగును. దీనినే ఇంద్రకల్పమనియును చెప్పుదురు. ఇట్టి ఇంద్రకల్పములు పదునాలుగు (14) ఐనచో బ్రహ్మదేవునకు ఒక దినంబు, ఇటువంటి దినంబులు మున్నూటయఱువది (360) అయినచో బ్రహ్మకు ఒక సంవత్సరము. ఇట్టివి నూరు అయినచో

నొక బ్రిహ్మకల్పమనబడును. ఇట్టి నూరు బ్రహ్మకల్పంబులు దీర్ఘాయువను ఋషికి ఒక్క దినంబగును. ఇట్టి దీర్ఘాయువు ముని దినంబులు యిరువదియేడు (27) కోట్లు అయినచో, రోమశమహా మునికి-ఆతని శరీరమందున్న యొక రోమంబు వీడిపడును. ఇట్టి రోమశమహాముని దినంబులు ముప్పదిమూడు (33) కోట్లు అయినచో అష్టావక్ర మహామునికి ఒకయెముక వంకర దీరును. అట్టి అష్టావక్ర మహాముని దివసంబులు నలుబది (40) కోట్లు అయిన యెడల, పాద దృఝ్మనికి (భారద్వాజ మహాముని. ఈతనికి పాద మధ్యంబున నేత్రంబుగలదు. కావున నీతడు పాదదృఝ్మనుడని పిలువబడెను.) ఒక్క నిమిషంబగును. ఇట్టివి ఒక అర్బుదంబు కోట్లయినను శ్రీ విరాట్ మహా పురుషునకు ఒక్క నిమిషమయి నను కాదు.

అట్టి శ్రీ విరాట్పురుషుడు ఈ సమస్త చరాచర జగత్తు నంతటను వ్యాపించి, నిత్యుడై, సర్వసాక్షియై, నిరాకారుడై, నిర వద్యుడై, సహస్రశీర్ష, ద్విసహస్రబాహువులు గలవాడై వేద వేదాంగములకును అగోచరుండై, ఉపాదాన కారణభూతుండై, పరమ మునీంద్ర హృదయాంతర్గతుండై, పరమ హంసాకార ప్రభావుండై, చతుర్ముఖాది ప్రముఖ దివిజవందితుడై, దివ్యతేజో మయుండై, ప్రకాశించుచు, నతడు తన సంకల్ప మాత్రంబున, అహంకారాది ప్రకృతి స్వరూప బ్రహ్మాండముల యందంతటను వ్యాపించి, సత్వ, రజ స్తమో గుణాకారులగు బ్రహ్మ విష్ణు -

మహేశ్వరులను నిర్మించి, జగన్నిర్మాణ కారణభూతంబైన రజో గుణమును, చతుర్వేదములను బ్రహ్మకొసంగి పోషింపుమనెను.

పిమ్మట - జగద్రక్షణమునకు మూలంబగు సత్త్వగుణ మును, చక్రాయుధమును విష్ణువున కొసంగి, పరిపాలింపుమనెను. ఆ తరువాత, సంహార నిపుణత్వంబు గలదియగు త్రిశూలమును, తమోగుణంబును మహేశ్వరుని కొసంగి లయింపు జేయు మనెను.

## బ్రహ్మ సృష్టిక్రమము.

అప్పుడు బ్రహ్మ జగత్ సృష్టింపదలచి, శ్రీ విరాట్‌స్వరూ పుని సంస్తుతించి, కార్యరంగంబున బ్రవేశించెను. ఇట్లా బ్రహ్మ దేవుడు హానివృద్ధులులేని ఆ పరాత్పరుని యనుజ్ఞ బడసినవాడై ప్రప్రథమమున, పంచభూతములలో నొకటియగు ప్రాణమువలన, ప్రజాపతిని సృష్టించెను. పిమ్మట అపానమువలన క్రతువును; వ్యానమువలన పులహుని, ఉదానమువలన పులహస్త్యుని, సమాన మువలన వశిష్ఠుని, శిరమువలన గగనమును, చెవులవలన వాయు వులను, నేత్రములవలన సూర్య చంద్రులను, ముఖమునుండి ఇంద్రుని, అగ్నిహోత్రుని; నాభివలన అంతరిక్షమును, రోమ కూపములనుండి అతల - వితల - సుతల - తలాతల-రసాతల- మహాతల - పాతాళంబు లనెడి అధోలోకంబుల నేడును; మఱియు భూలోక - భువర్లోక - సువర్లోక - మహాలోక - జనలోక- తపోలోక-సత్యలోకంబు లను ఊర్ధ్వలోకంబుల నేడిటిని బుట్టిం

చెను. పిమ్మట, ముఖమునుండి బ్రాహ్మణులను ; భుజములనుండి క్షత్రియులను; ఊరువులనుండి వైశ్యులను; పాదములనుండి శూద్రులను; సర్వాంగములనుండి దేవతలను, మరియు - యక్ష, రాక్షస, గంధర్వ, సిద్ధ, విద్యాధర, కిన్నర, కింపురుష, గంధర్వాది నానావిధ ఖేచరీ బృందంబులను జనింపజేసెను. మఱియు నా బ్రహ్మదేవుడు ద్వాదశాదిత్యులను, ఏకాదశరుద్రులను, నవగ్రహ ములను, అష్టదిక్పాలకులను, దిగ్గజంబులను, మాతృకా సప్తక కమును, మహాముని - సాగర - శైల - ద్వీపంబులను, నదీ నదంబులను, భూ-జల-వన-కుధర - పక్షి-ద్రుమ-లతా-పశు - మృగ-క్రిమి - కీటకాది జంతువులను పుట్టించి, ఆ యా వాటికి తగిన పాపపుణ్యములను, సత్యాసత్యములను, ధర్మాధర్మములను, వృద్ధిక్షయములను గల్పించెను. మఱియు వాని వానికి యోగ్యతను బట్టి ఆహారము, స్థానము, నిద్ర, రతి, సంతసము, భయము, మర్యాద, ఆశ్రమధర్మము, వర్ణము మొదలగున వన్నియు నేర్పాటు గావించి ప్రపంచంబు నుద్ధరించెను.

## పురోహిత నిర్ణయము

అటు పిమ్మట సృష్టికర్తయగు నాబ్రహ్మదేవుడు తన కుడి యంగములనుండి సర్వజాతి పురుషులను, ఎడమయంగములనుండి నా యా జాతుల యొక్క ఎల్ల స్త్రీలను బుట్టించెను. బ్రాహ్మణులకు వేదాధ్యయనము నిర్ణయించెను. క్షత్రియులకు భూపరిపాలనా కార్యము నిర్వహింప నానతి యిడెను. వైశ్యులకు కృషి, వాణిజ్య

గోరక్షణా భారమున నియుక్తు లగునట్లు కట్టడి గావించెను. శూద్రు లను పై మూడు వర్ణములవారికి దాసులుగా నుండ నియమించెను.

పిమ్మట ఆ బ్రహ్మదేవుండు మానసపుత్రుండగు ఆంగీర సుని బ్రాహ్మణులకు పురోహితుని గను, క్షత్రియులకు ముని పుంగవుడగు వశిష్ఠుని, వైశ్యప్రముఖులకు అపరార్క మహాముని పుంగవుని పౌరోహితులుగా నిర్ణయించి కర్మభూమికి విడనాడెను. వారును తమతమ ధర్మములను దప్పక పురోహితాను సారంబుగ సత్కర్మంబుల నాచరించుచు దినదినాభివృద్ధి నందసాగిరి. శూద్రు లును పై మూడు వర్ణబులకు సహాయకారులై మెలంగ జొచ్చిరి.

అపరార్క మహామునియు బ్రహ్మజ్ఞాను సారముగ వణిక్పుంగవులకు పౌరోహితుడై – వారికి కావలసిన సకల సదు పాయములః గనుచు, వైశ్యపుత్రులకు పండ్రెండేండ్ల ప్రాయము వచ్చుసరికి, యజ్ఞోపవీతాధి కరణం బగు ఉపనయనమును గావిం పజేయుచు, బ్రహ్మచర్యాశ్రమ ధర్మములను జేయుచు వారిని పునీ తుల గావింపుచుండెను. అట్లే వైశ్యకుల స్త్రీలకు తగుధర్మములను, స్త్రీలుండవలసిన విధానములను బోధించుచు, ఆ యా స్త్రీపురుషు లకు – గోత్ర ప్రవరముల కనుగుణముగా – వైవాహిక మహో త్సవములను జరిపించుచు, గర్భాదానాది పంచదశ కర్మములను, దేవబ్రాహ్మణ పూజాది సత్కర్మములను, వ్యవహారాది కర్మ ములగు క్రియ, ధైర్య గాంభీర్యాదులను తెలియబఱచెను. పిమ్మట వస్తువాహనాది వివిధ పదార్థంబుల పరీక్షయు, క్రయ విక్రయాధు

లలో నిపుణత్వంబును, ధర్మాధర్మ వివేకంబును, గోరక్షణాది సత్కర్మములను బాగుగా బోధించి, ఆ మహామునిపుంగవుడగు అపరార్కుడు తననివాసమునకు వెడలిపోయెను. బుద్ధి కుశలు రగు వైశ్యప్రముఖులు భూలోక నివాసులై అపరార్క మహాముని ఉపదేశాను సారంబుగ మెలంగుచు, అష్టైశ్వర్య సంపన్నులై, స్వకులాచార ధర్మంబుల దేమరక మెలంగు చుండిరి. ఇట్లు క్రమంబున న్యాయవర్తనులై సంచరించు వైశ్యప్రముఖులు దిన దినాభివృద్ధి నొంది దేశమం దెల్లెడల వ్యాపించి మిక్కిలి యౌన్న త్యమును గాంచిన వారైరి.

## వైశ్యులు శాపగ్రస్థు లగుట

స్వాయంభువ మన్వంతరకాలములో ప్రథమ యుగము నాటికి సర్వమానవులును, దేవతల కీడగు వయస్సు కల్గినవారలై రెండులక్షల ఆయుః పరిమాణముగలవారై వెలుంగఁజొచ్చిరి. కావున నరులకు, సురలకు భేదములేక యుండెడిది. అట్టి సమ యమున నొకనాడు విరాట్పురుషుడు బ్రహ్మ-క్షత్రియ, వైశ్యపు రోహితులగు అంగీరస - వసిష్ఠ - అపరార్క మహా మునులను బిలువ, వారును తమతమ జాతులవారితో ఆయన సన్నిధి కేతెంచిరి ఆ మహాసభయందు, బ్రహ్మాది సమస్త దేవతా బృందమును అలంకరింపబడి యుండెను.

అప్పుడు సృష్టికర్తయగు బ్రహ్మదేవుండు త్రివర్ణముల వారిని గాంచి మీమీ వర్ణంబులయం దిప్పుడు యెన్ని యెన్ని గోత్ర

ములవారు కలరో వినజేయు"డని యడిగెను. అప్పుడు బ్రాహ్మణ వర్ణంబునుండి దుర్వాసు డను బ్రాహ్మణుండు లేచి, ఇప్పుడు మాలో నూట తొమ్మిది (109) గోత్రములు గలవని విన్నవించు కొనెను.

పిమ్మట క్షత్రియ బృందమునుండి ధనంజయుడను భూపతి లేచి "మాలో సప్త (7) గోత్రములు మాత్రమే గలవని విశదీక రించెను. తదుపరి, వైశ్య కూటము నందుండి "సమాధి" యను వణిక్పుంగవుడు లేచి, "మా వర్ణంబున (714) ఏడువందల పదు నాలుగు గోత్రములు విలసిల్లు చున్నవని వాక్రుచ్చెను.

అందులకు బ్రహ్మ పరమానందము నొంది, త్రివర్ణంబుల యందును మిన్నలై వణిక్పుంగవులే యుండుటకు హర్షంబు నొందినవాడై, వారలను మిక్కిలి కొనియాడెను, అది కారణ ముగ పెక్కుమంది వైశ్యగోత్రజులకు గర్వంబంకురించెను. అయి నను అందులో కొందఱు లేచి, వినయముట్టి పడునట్లుగా "మహా నేతా! తమ దయారసంబువలన, మేము అధికసంఖ్య గోత్రజు లమై ప్రకాశించు చున్నను నైకమత్యముగా కలసిమెలసి సంచ రింపుచుంటిమి. ఇందులకు కారణము తమయొక్క దయార్ద్ర దృష్టియే" అని పల్కిరి.

మఱికొందఱు వైశ్యులు లేచి, "భగవంతుడవైన యోబ్ర హ్మదేవా! మేము అందఱికంటెను నెక్కువ గోత్రజులమై

యుంటిమిగాన, బ్రహ్మక్షత్రియ వర్గంబుల కంటె, మా వర్గమే అధికము. మాకు సర్వశ్రేయములు గలుగునట్లుగా వరం బొండు ప్రసాదించుము" అని అహంకారపూరితులై వేడుకొనుచు బ్రాహ్మణులను జూచి పరిహసించుచు, "మేమె మీకంటె యధికులము. కావున మీరు మా యిచ్చానుసారంబుగా మెలంగవలయు నని పరిహాసము గావించిరి.

ఆ పరిహాస వచనములు బ్రాహ్మణులు సహింప జాలక పోయిరి. అందుచే నందుండి యొక బ్రాహ్మణ పుంగవుడు లేచి, "వైశ్యులారా ! మీరధిక సంఖ్య గోత్రజుల మైతిమని గర్వంబున క్రిందమీ దెఱుంగక, తోటివారి నవమాన పఱచినారు. ఇట్టి మీ గర్వమునకు ప్రాయశ్చిత్తము కావలయును. కావున మీరు నీచులై జాతి భ్రష్టులగుదురు గాక!" యని శపించెను. అందులకు వైశ్యులలోనుండి నూటరెండు గోత్రజులు లేచి - "మహాత్మా ! క్షమింపుము. మావారు, అధికుల మను గర్వంబున మీకు సల్పిన యపచారమును సైరింపుడు. ఇంతటి కఠినశాపమునకు మమ్ము గురి జేయకుడు" అని ప్రార్థించుకొనిరి.

అందుల కా భూసురోత్తముడు కరుణించి, "మీ రిట్లు ప్రాధేయులైతిరి గావున సూర్యచంద్రు లున్నంత వఱకు మీ 102 గోత్రముల వారును చిరస్థాయిగా మనగలరు. మఱియు బ్రహ్మజ్ఞాన వర్తనులై, శ్రేష్ఠత్వంబును గాంచి "శ్రేష్ఠి" బిరుదాంకితులై ప్రకాశింపగలరు. తక్కిన మీ యీ గోత్రజులు వంశమైనను లేకుండ నశింతు"రని మరల నుడివెను.

అంత సృష్టినేతయగు బ్రహ్మదేవుండును వైశ్యశిఖామణు లను జూచి, "ఓ వర్తక పుంగవులారా! బ్రాహ్మణశాపం బమోఘ మైనది. దానిని పోకార్చు శక్తి మాకే లేదు; ఇక మీరన నెంత? మీరికనైన బ్రాహ్మణద్వేషులు గాకుండుడు. మఱియు మీవంశ మున కొంత కాలమునకు మాయాశక్తి కన్యకస్వరూపంబున జన్మింపగలదు. ఆమె కొండొక కారణంబున, అగ్నిప్రవేశము కాగలదు. అప్పు డామెతో మీ గోత్రజులు కొందఱు అగ్నిగుండ మున ప్రవేశింతురు. అట్టివారలకే బ్రాహ్మణ శాపము తగులదు. వారు స్థిరముగా నుందురు, తక్కిన వారు జాతి భ్రష్టులై నామ రూపములు లేకుండ నుందురు" అని పలికి వారి వారలను స్వసద నములకు బో నియమించెను. ఆనాటి బ్రహ్మసభ యట్టి మహో త్పాతముతో ముగిసెను.

## వైశ్యుల కైలాస ప్రవేశము

అటు పిమ్మట నా వైశ్యశిఖామణులెల్ల బ్రహ్మదేవుని వద్ద సెలవుగైకొని, భూమండలమునకు చేరుకొనిరి. అయినను వారి హృదయములందు వెదకిచూచినను సంతోషము గనిపింపకుండెను. బ్రహ్మవేత్తలగు బ్రాహ్మణుల శాపము, బ్రహ్మదేవుని వాక్కులు వారు మఱువజాలక పోయిరి. అందువల, వారు తమ పౌరోహి తులగు అపరార్కమహాముని యాశ్రమంబునకుబోయి, అమ్మహా త్మునికి జరిగినదెల్ల వినికిడి జేసి ఇట్లు వేడికొనిరి.

"మహాత్మా ! మే మీ మానవలోకమున బడి అనేక బాధలు జెందుచు, కర్మబంధములకు లోనయి జీవితములు బుచ్చుచుంటిమి. స్వప్నావస్థతో తుల్యమగు, నీ మానవజన్మ యెన్నటి కైనను నశించి తీరవలసినదేగదా ! కావున మాకు మోక్షప్రదమగు మార్గము గోచరించు యుక్తి నిదెల్పి తరింపజేయుడు. తొల్లి ఎందరో మహాత్ములగు వారి నాశ్రయించి మోక్షప్రాప్తు లయినట్లు వినియున్నారము కావున తాము దీర్ఘముగానాలోచించి మమ్ముల నుద్ధరింపుడు."

వైశ్యపుంగవుల వచనములకు, మహాత్ముడగు అపరార్క ముని నిదానముగా కొంతసేపు యోచించి వారిని గాంచి "వర్తక పుంగవులారా ! మోక్షప్రద మగు మార్గము గనవలె నన్న, అది సులభముగా లభించునది కాదు. ఎంతవరకు శరీరమందు అరిష డ్వర్గములగు కామ, క్రోధ లోభ మోహ, మద, మాత్సర్యము లుండునో, అంతవరకును వారు మోక్షమున కర్హులు గానేరరు. కావున, ఆ అరిషడ్వర్గములను నిర్జించి యేకాగ్రచిత్తము గలిగి పరమేశ్వరుని గూర్చి తపం బాచరించినచో, అట్టివారికి మోక్షప్ర దము లభించగలదు. కావున మీ రేకాగ్రతచిత్తము గలవారలై పరమేశ్వరు నారాధింపుడు. ఆ మహామహుని దయారసంబువలన పుణ్యలోక ప్రాప్తి సిద్ధింపగలదు. తప్పక మీరు తపస్సు చేసి పుణ్యలోకము నాక్రమించుడు" అని పలికి అందులకు తగిన పంచాక్షరిమంత్రము మొదలైనవి ఉపదేశించి, దీవించి - తపస్సునకు యోగ్యమైనదియు, పవిత్రమైనదియు అగు - హిమవన్నగ మునకు బొండని సెలవిచ్చి పంపివేసెను.

సత్యపరాయణవర్తనులు, సుశీలురు నగు వైశ్యపుంగవు లట్లు పురోహితుడగు అపరార్కుని సెలవు బడసి ఆయనకు సాష్టాంగ వందనములు సల్పి. అక్కడనుండి బయలుదేరి గుర్వా నుమతిని హిమవత్పర్వతమునకు జేరుకొని, గౌరీసమేతుండగు శంభుని గూర్చి తపం బాచరింపసాగిరి. జలముల గ్రోలి కొంద ఱును, వాయువును బీల్చి మఱికొందఱును, వేఱొక కొందఱు నిరాహారులుగను, ఇంకొక కొంతమంది పర్ణాశనులు (ఆకులు మాత్రమే భుజించువారు)గను, మఱికొంతమంది పంచాగ్నుల మధ్యంబునను, ఇంకను వేఱొక కొందఱు జలమధ్యంబునను, కొందఱు ఏకపాదంబునను, కొంద ఱధఃశిరస్కులు (తలక్రిందు లుగా నున్నవారు)గను. మఱికొందఱు ఊర్ధ్వబాహువులు గలవా రుగను తపస్సు చేయసాగిరి.

ఇట్లు పెక్కుభంగుల నా వైశ్యప్రముఖులు చేయు తపస్సు నకు పార్వతీనాథుడు ముదంబంది, గౌరీసమేతుండై, వృషభ వాహన మెక్కి, వెంట ప్రమథగణంబులు గొల్వ, నా వైశ్యమును లకు ప్రత్యక్షమయ్యెను. అప్పుడు వైశ్యమునులు దయాకరు డగు నప్పరమేశ్వర పుణ్యదంపతులను గాంచి, బ్రహ్మానందభరితులై, భయ — భక్తుల తోడను, వినయముతోడను ఉమాశంకరులకు సాష్టాంగ వందనము లొనర్చి, పెక్కువిధంబుల నిట్లు స్తోత్రము గావించిరి.

శ్లో॥ శాంతం పద్మాసనస్థం శశిధర మకుటం
పంచవక్త్రం త్రినేత్రం
శూలం వజ్రం చ ఖడ్గం పరశు
మభయదం దక్షిణాంగే వహంతమ్॥

శ్లో॥ నాగం పాశం చ ఘంటాం వర
ఢమరుయుతం చాంకుశం వామభాగే
నానాలంకారయుక్త స్ఫటిక
మణినిభం పార్వతీశం నమామి॥

శ్లో॥ ఆత్మాత్మం గిరిజామతిః పరిజనాః
ప్రాణాశ్శరీరం గృహం
పూజాతే విషయోపభోగరచనా
నిద్రాసమాధిస్థితి
సంచారః పదయోః ప్రదక్షిణ విధిః
స్తోత్రాణి సర్వాగిర
యద్యత్కర్మరోకమి తత్తదఖిలం
శంభో తవారాధనమ్॥

శ్లో॥ సమస్త వేదవేదాంత సారభూతం శివప్రదమ్
శివ నామామృతం దివ్యం పేయం సర్వార్థ సాధకమ్

శ్లో॥ నమస్తే నమస్తే మహాదేవ శంభో
నమస్తే నమస్తే ప్రపన్నైక బంధో
నమస్తే నమస్తే దయాసార సింధో
నమస్తే నమస్తే నమస్తే మహేశ॥

ఇట్లు స్తోత్రము చేసి, ప్రదక్షిణము లాచరించి సాష్టాంగ వందనము లాచరించిరి.

అకలంకమతులగు నా వైశ్యమునులయొక్క స్తోత్రము నకు సంతుష్టుడై సదాశివు డప్పుడు వారలను గాంచి "వైశ్యమును లారా! మీ తపస్సు, మీ వినమ్రత, మీ భయభక్తులు మమ్మెంతేని ముదం బందజేసినవి. కావున సంకోచింపక మీకు వలయు వరముల గోరుకొనుడు. సంతోషముతో నీయగలవాడ" నని పలికెను. అందులకు వైశ్యమునులు హర్షించి "దేవదేవా! భవదీయ దర్శనమాత్రంబుననే మా పాపము లెల్ల నిర్మూలన మైనవి. అయినను మాకొక కోరిక గలదు. అదేమన, చిరకాలము మే మీ మానవ ప్రపంచమున బడి, కర్మబద్ధులమై జీవితముల గడిపితిమి. ఇహసౌఖ్యము లనిన రోత కలుగుచున్నది. కావున మాపై కరుణారసము గురిపించి, నేటినుండి మ మ్మెల్లర కైలాస వాసులను గావింపుము. నిత్యము నీ నిత్యానందస్వరూపమునకు సేవ లొనర్చుచు మా జీవితముల బుత్తుము. ఇంతకంటె మేము కోరునది వే తొండు లేదు. అనుగ్రహించి మా యీ అభీష్టమును సఫలీకృత మొనర్చుము"అని వేడుకొనిరి. అంత నమ్మహాదేవుడు నిర్మలాంతఃకరణా శీలుం డౌటవలనను, నిర్భరానందసందోహుండగుట వలనను నా వైశ్యమునుల కోరిక కియ్యకొని, వారల నెల్ల కుటుంబములతో సహా కైలాసమునకు దీసికొనిపోయెను.

ఇట్లు సుశీలురగు న వైశ్య శిఖామణులు కైలాసమున వసించుచు, నిత్యము పార్వతీ పరమేశ్వరుల సేవించుచు నిత్యానందదాయకులై మెలగజొచ్చిరి.

## వైశ్యమునులకు గంధర్వుని శాపము - అందులకు వారిచే గంధర్వునికి ప్రతిశాపము.

కైలాసవాసులై వైశ్యు లిట్లు ఆనందముతో నున్న తరిని, కొంతకాలమునకు నొక విచిత్ర సంఘటన జరిగినది. ఏమనగా, అప్పటి కా వైశ్యబృందములో శంభుశ్రేష్ఠి అను నొక వైశ్య రత్నము మిక్కిలి పేరును గాంచి, పరమేశ్వరారాధనా శీలుడై, సశ్శీలుడై యుండెను. ఆయనకు మణివోలె నొక కన్యకామణి పుత్రిక గలదు. ఆమె పేరు దేవకి. ఆయమయు పరమేశ్వరా రాధనాశీలి. మఱియు జగన్మోహిని. ఆమె యందచందము లపూర్వ మైనవి ; గుణములు వర్ణింపరానివినై యుండెను.

ఒకప్పు డా దేవకి శివసేవకై బోయి వచ్చుచుండగా మధ్య మార్గమున చిత్రకంతు డను నొక గంధర్వు డా చిన్నదాని సోయగ మును గాంచి, మదనావేశపరుడై వలచి, ఎట్లయిన నా కన్నెను పరిణయమాడవలె నని నిశ్చయించుకొని ఆమెతండ్రియగు శంభు శ్రేష్ఠికి తన కోరిక నివేదించుకొనెను.

చిత్రకంతుని ప్రార్థనను శంభుశ్రేష్ఠి యంగీకరింపలేదు. మఱియు కులపెద్దల కొందఱిని విచారించి, వంశేతరు డెంతటి గొప్పవాడైనను కన్య నిచ్చుట యనునది పాపహేతువుగ నిశ్చ యించుకొని ఇట్లు బదులు పలికెను. "మేము వైశ్యులము, నీవు గంధర్వుడవు. బాగోగులెట్లున్నను వర్ణేతరులకు కన్యాదానము

గావింపనేరము. నీవును కోరదగదు. కావున నీ మనస్సు మార్చు కొనుము" ఇట్లు ఖండితముగా బలికిన యా పలుకులు చిత్రకంఠు నకు ములుకులై నాటుటవలన, యుక్తాయుక్తములు గణింపక క్రోధావేశపూరితుడయ్యెను. కామాంధులకు దూరాలోచన యుండ నేరదుగదా!

అందువలన, నా గంధర్వుడు మిక్కిలి కోపించి, "విర హాగ్నిలో నన్ను ప్రగ్గునట్లుగా జేసి, మీరెల్ల రేదియో కట్టుకథల నమ్మియున్నారు. కాన, మీరెల్ల భూలోకవాసులగుదురు గాక! మఱియు మీ రందఱు కన్యకామూలమున అగ్ని కాహుతులై నుసి యౌదురుగాక!" అని శపించెను. అందులకు శంభుశ్రేష్ఠియు మిక్కిలి కోపగించి, "అన్యాయముగా నీవు మమ్ము కామాంధుడవై గమనింపక శపించినాడవు. నిరపరాధుల, యుక్తా యుక్తముల గమనింపక శపించిన నీవును, భూలోక వాసి వౌదువుగాక! మఱియు నీవు అక్కడ మా కులకన్య నాశించి, ఆమెను పొంద కయే, విరహాగ్నిచే కుంది - తుద కామె శాపవచనమున తల పగిలి మరణింతువు గాక!" అని ప్రతిశాప మొసంగెను. అందు లకు చిత్రకంఠుడు మిక్కిలి ఖిన్నుడై యుండాడనేరక నిజసద నమున కరిగెను. పిమ్మట శంభుశ్రేష్ఠి దేవకిని యొక సుము హూర్తమున మేనత్త కొమరున కొసంగి మహా వైభవమున వివాహము గావింపజేసెను. ఆ వేడుకలో చిత్రకంఠు డేమైన కీడు తేవచ్చునని భయపడి శంభుశ్రేష్ఠి జరిగిన దెల్ల నందీశ్వరునికి

దెల్పి ఆ పెండ్లికి సహాయకారిగా ఉంచుకొనెను. ఈరీతి దేవకి పెండ్లి మహావైభవముగా ముగిసినది.

# పార్వతీ కల్యాణము

పిమ్మట జగద్రక్షకుడగు సదాశివుడు హిమవంతుని పుత్రిక యగు పార్వతిని పెండ్లాడి, ఒకనాడు కొలువుదీర్చి యుండగా నా సభకు చతుర్దశభువనములవారును నా మహావేడుకను తిలకించుటకై చనుదెంచిరి........అని సాలంకాయన మహర్షి వినిపించుచుండగా, వైశ్యమునులు సాలంకాయన మహర్షిని వీక్షించి "స్వామీ దాక్షాయణి హిమవంతుని కెట్లు తనూజ యయ్యెను? అట్లగుటకు కారణమేమి? మా కాపవిత్రచరిత్రము వినిపించి ధన్యుల గావింపు" డని వేడికొనిరి. అంత సాలంకాయనముని ముద మంది, వారికి పార్వతీకల్యాణ మిట్లు వినిపింపసాగెను.

ఓ వైశ్యమునిపుంగవులారా! వైశ్యులు కైలాసనివాసులై నిత్యము పరమేశ్వరుని పూజించుచు బ్రహ్మానందము జెందుచుండిరి. అట్టి తరుణమునం దొకసారి బ్రహ్మమానసపుత్రుడును, త్రిలోకసంచారియు నగు నారదమౌని పెక్కు తావులు వీక్షించి, క్రమముగా దక్షప్రజాపతి వద్దకు చేరుకొనెను. దక్షుడును నారదమునిని సగౌరవముగా ఆదరించి యిట్లడిగెను.

మునీంద్రా! సర్వేశ్వరుడగు నా అల్లుడు ఈశ్వరుడు, నా కుమారిత దాక్షాయణి క్షేమముగ నున్నవారా? మఱియు నే యే

వింతలు గనుగొంటిరి ? అని యడుగుటయు, నారదుడు చిరునవ్వు నవ్వి "ప్రజాపతీ ! పుణ్యదంపతులగు మీ కూతురు అల్లుండ్రకు శుభముగాక, వేరొండు కలుగగలదా? వారు సదా ఆనందమయులై ప్రకాశించుచున్నారు. దాక్షాయణి మిమ్ము మఱిమఱి తలంచినది. అత్తింట మహద్భోగము లున్నను, ఆడుబిడ్డలకు పుట్టింటిపై ఆశ యుండుట సహజమేకదా ! మీ పిలుపునకై ఆ సతి మిక్కిలి యెదురుచూచుచున్నది" అని పలికి, తదుపరి యా మహాముని వారి సెలవంది వెడలిపోయెను.

నారదమహర్షి వెడలిన తరువాత దక్షప్రజాపతియు, అతని భార్యయు నాలోచించుకొని తాము సేయబోవు యజ్ఞమునకు కూతురను అల్లుని పిలుచుటకై నిశ్చయించుకొనిరి. పిమ్మట దక్షుడు యాగము మొదలిడుటకు ముందు వారిని గొనిపచ్చుటకై కైలా సమున కేగెను. ప్రజాపతి యక్కడ కేగుచరికి పరమేశ్వరుడు ప్రజాపతిరాక తెలిసికొనెను. కాని నేత్రములు తెరవలేదు. తెరచిన ఆ యోగసమాధి మహత్త్వము వలన నేత్రములనుండి అగ్నిజ్వాలలు వెలువడి యాతని భస్మము కావించునని శంకరుని తలంపు. కాని, దక్షుడది అమర్యాదగా నెంచెను. తనను పలుకరింపలేదనియు, చూడలేదనియును తలంచి క్రోధావేశపూరితుడై కుమారితను కూడ గననొల్లక, గిరుక్కున మరలి తన నివాసమునకు చేరుకొని యజ్ఞము ప్రారంభించెను.

ఈ సంగతి యంతయు తరువాత దాక్షాయణికి తెలిసినది. పతియొక్క భావము, తండ్రియొక్క అవివేకము గుర్తించినది. తండ్రి కీ సంగతి జెప్పుటకును, తండ్రి సల్పుచున్న యజ్ఞమును వీక్షించుటకును ఆ మహాసాధ్వి పుట్టింటికి పయన మయ్యెను. పరమేశ్వరు డది తెలిసికొని ఆమెను జూచి "దేవీ ! నీ తలంపు మంచిదే. కాని, మీ తండ్రి అభిమానపూరితుడు. కావున నీ వటకు పిలువని పేరంటమునకు బోవలదు. అవమానము సేయ చూచు చున్న ఆతనికి నీరాక ఆనందమై తప్పక నిన్ను పదిమందిలో తృణీకరింపగలడు. ఇప్పటి కీ పయనము మానుకొనుము. తరువాత చూచుకొందము" అని హెచ్చరించెను. కాని ఆ సతి పుట్టింటిపై గల మక్కువ వలనను, ఎంతవారైనను కన్నపుత్రిక నవమానింతురా ? యను విశ్వాసము వలనను తనపట్టు విడువలేదు. ఇక శంకరు డేమి చేయగలడు ? "చెప్పగా విననివారిని చెడగా చూడు" మని కదా సామెత ! "సరే ! ఇక నీ యిష్టము, జరుగునది జరుగక మానదు" అని పలికి యామెను పుట్టింటి కనిపెను.

## దాక్షాయణి యోగాగ్నిచే మృతి నందుట.

దాక్షాయణియు నిట్లు పతి సెలవు నంది పుట్టినింటికి బోవు సరికి యక్కడ యామెను పలుకరించువారలే లేకపోయిరి. తోడ బుట్టిన సోదరీమణులు, కన్నతల్లియుకూడ దక్షప్రజాపతికి వెరచి ఆమెను "ఎప్పుడు వచ్చితి?" వని కూడ నడుగజాలకపోయిరి. ఆమె పరిస్థితి కట కాహూతులైన స్త్రీగణ మెల్ల ముసిముసి నగ

వులు నవ్వుకొనసాగిరి. ఇదియంతయు వీక్షించుసరికి ఆమెకు పతి యన్న వాక్యములు జ్ఞప్తికి వచ్చెను. కాని, ఏమి చేయగలదు? తన తెలివితక్కువకు కొంతసేపు విచారించెను. ఇంతలో తండ్రియు నామెను వీక్షించి కోపముతో "ఎందులకై వచ్చితివి? నిన్నేమైన 'రా! అమ్మా!' అని బొట్టు కాటుక పెట్టి పిలిచితిమా? ఏడీ! నీ పతి? పొరపాటున వచ్చెనా యేమి? అదిగాక స్మశానములలో దిరుగు ఆ జోగులు ఇక్కడ కెట్లు రాగలడు? ఈ వేడుక లా కాటి ద్రిమ్మరి కెట్లు రుచించును? పంది పన్నీరు మెచ్చదుగదా!" అని పెక్కురీతుల నిందించెను. ఆ వాక్యము లన్నియు దాక్షాయణికి ములుకుల వలె నాటినవి. అందువలన నామె యట నుండుటకును, మరల పతిగృహమున కేగుటకును కూడ సమ్మతింపజాలక, అభిమానపూరిత హృదయ యై అక్కడనే యోగాగ్ని రగుల్కొల్పి ప్రాణములు విడనాడెను.

## వీరభద్రుని జననము — దక్షయజ్ఞ విధ్వంసము

ఈ సంగతి పరమేశ్వరునికి తెలిసినది. తోడనే యతడు క్రోధావేశపూరితుడై జటాజూటమును పృథివిపై గొట్టగా నందుండి వీరభద్రు డవతరించెను. శివు డాతనిగాంచి "కుమారా! నీ తల్లి మరణమునకు కారకు లయినవారి నెల్ల వధించి రమ్మ" అని ఆజ్ఞాపించెను. వీరభద్రుడును రెండవ రుద్రునివోలె క్రోధానలము నెగజిమ్ముచు పోయి ఆ యాగమును ధ్వంసము కావించి దక్షప్రజాపతిని రెండు ఖండములుగ ఖండించివేసెను.

బ్రహ్మమానసపుత్రుడగు దక్షప్రజాపతి మరణము వలన లోకము లన్నియు కలపర మందెను. అప్పుడు బ్రహ్మ మిక్కిలి విశ్వాసముతో శివునికై తప మాచరించి, ఆతని కృపారసమువలన తిరిగి దక్షప్రజాపతిని మేకతల యతికించి బ్రతికించుకొనెను.

## దాక్షాయణి హిమవంతునికి పుత్రికయై జన్మించుట.

అట్లు యోగాగ్నిబడి జీవితముల బాసిన దాక్షాయణి పర్వత రాజగు హిమవంతునికి, ఆతని ధర్మపత్నియగు మేనకకు కుమారి తయై జన్మించెను. హిమవంతుని పుత్రిక యౌటచే నాటినుండి, ఆమె ఉమాదేవి యనియు, హైమవతి యనియు, పార్వతియనియు పిలువబడుచుండెను. ఇట్లా సతి దినదిన ప్రవర్ధమానయై పెరుగుచు, పూర్వజన్మస్మృతి గలదియై, శివారాధనా శీలియై యుక్త వయస్సునకు వచ్చెను.

ఇట్లుండగా తారకాసురుడను దానవరాజు ముల్లోకములను జయించి, ఇంద్రాదులను పారద్రోలి స్వర్గము నపహరించి, స్వర్గాధినేతయై, గో-బ్రాహ్మణ హంతకుడై లోకకంటకుడై యుండెను. వానిబాధలకు తట్టుకొనజాలక, యొకనాడు ఇంద్రాది దేవతలు, ముల్లోకవాసులు బ్రహ్మ పాలికిబోయి, తమ దీనత్వమును విశదీకరించుకొని రక్షింపు మని వేడికొనిరి. అప్పుడు బ్రహ్మ దీర్ఘముగ నోచించి యిట్లు బోధించెను.

"దేవతలారా! విచారింపకుడు. వాని చావు మనవలన నగునది కాదు. ఈశ్వర సంజనితుడగు కుమారుని వలన కాగలదు. ఇప్పుడు పత్నీవ్యసనము వలన శంకరుడు తపము చేసుకొను చున్నాడు పార్వతి హిమవంతునికి పుత్రికగా జన్మించి యుక్త వయస్సుగలదై యున్నది. ఈశ్వరు నిప్పుడా తపస్సమాధినుండి లేపి, కామాసక్తుని గావింపవలయును. ఇందులకు మన్మథు డొక్కడే సమర్థుడు. కావున నీ పని కాతని నియమింపుడు." అని యనుగ్రహించెను.

## మన్మథ సంహారము - ఉమాశంకరుల వివాహము

బ్రహ్మాజ్ఞానుసారము మన్మథుడు లోకసంరక్షణార్థమై తన పరివారమగు వసంతుడు, చంద్రుడు, మలయ మారుతము, వెంట నడువ-చిలుక వాహనమెక్కి శంకరుడు తపస్సుచేయుచున్న హిమ వత్పర్వతమును చేరుకొనెను. అప్పటికి శివుడు మంచి తపోనిష్ఠలో నుండెను. ఉమయు, ఆ సమీపమందు శివుడు తపస్సుచేయుచున్నా డని తెలిసి యాతని పూజించుటకై యదే సమయమున కటకు చేరుకొనెను.

మన్మధు డా సమయమును వృధాగా పోనీక మోహాంకుర ములగు నవమల్లిక, నీలోత్పలము, అశోకము, చూతము అర విందము - అను ఐదు పుష్పబాణములు శివుని ఫాలమునకు గురి చూచి కొట్టెను. దానితో శంకరునికి తపోభంగమై కనులు దెఱ

చెను. వెంటనే ఉమను జూచెను. మోహము జనించెను. కాని, వెంటనే యతడు ఆమెను పార్వతిగా గ్రహింపజాలక పోయెను. కామోద్రేకము కలుగుటకు కారణము మన్మధుడు గదా! అందు వలన శివునికి ఆతనిపై క్రోధము గలిగి ఫాలమందున్న త్రినేత్ర మును దెఱచి మన్మధుని భస్మీభూతము కావించి వైచెను.

ఈ సంగతి మన్మధుని భార్యయగు రతీదేవి తెలిసికొని పరుగుపరుగున బోయి మహావిష్ణువు పాదంబులపై బడి-జరిగినది విన్నవించి - పతిభిక్షపెట్టుమని ప్రార్థించుకొనెను. కరుణాపూరితు డగు శ్రీమహావిష్ణువు ఆమెతో చనుదెంచి, పరమేశ్వరుని పెక్కు-విధముల కొనియాడి-మన్మధు డామెకు మాత్రము కనబడునట్లుగా ఆతని బ్రతికించి రతీదేవిని సంతోషపరచెను.

పిమ్మట శ్రీ మహా విష్ణువు తారకాసురుని బాధలు సవిస్త రముగా శంకరుని కెఱిగించి యిట్లు ప్రార్థించెను. "మహానుభావా! దాక్షాయణి యిప్పుడు హిమవంతుని పుత్రికయై జన్మించియున్నది. పార్వతి నామమున ప్రకాశించుచున్నది. నీ వామెను చేబట్టి తార కాసురసంహారకు డగు కుమారుని మాకు ప్రసాదించి, లోకములను రక్షింపుము" అని యిట్లు పెక్కు-విధముల కొనియాడగా సద యాంతః కరణుడగు శంకరు డందులకు సమ్మతించి, వెంటనే నారద మునీంద్రునిచే హిమవంతునికి పార్వతి నొసంగు మని రాయబార మంపెను. హిమవంతు డందులకు సమ్మతింపగా నొక

శుభ సుముహూర్తమునందు ఉమా శంకరుల వివాహ మతివై భోగమున జరిగినది.

## వైశ్యులు భూలోకమున అవతరించుట

లోక కల్యాణకరుం డగు శ్రీ పరమేశ్వరుం డిట్లు పర్వత రాజగు హిమవంతుని పుత్రికయగు పార్వతిని పెండ్లాడి, కైలాస మునం దొకనాడు మహావేడుకతో సభ దీర్చి యుండెను. ఆ మహా సభలో (భూలోకవాసులుదప్ప) చతుర్దశ భువనంబులవారును - ఆ పుణ్యదంపతులకు కానుకలు గొని వచ్చుటచే - అలరారి యుం డిరి. సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు, స్వర్గాధిపతియగు ఇంద్రుడు మఱియు దేవతలును అమూల్యములగు కానుకలను గొనివచ్చిరి. ఇట్లే ఆ యా లోకములవారు (మానవులు దక్క) గొప్ప గొప్ప కానుకలను గొనివచ్చిరి.

పరమేశ్వరుడు వారి నందరను కృపాదృష్టి వీక్షించి, మానవుల లేమికిం సంశయించి ప్రక్కనున్న కుబేరునితో "మాన వులిట లేకపోవుటకు గతం బేమి?" యని ప్రశ్నించెను. అంత కుబేరుడు పరమేశ్వరుని వీక్షించి, "దేవదేవా! తారకాసురుని ఉప ద్రవమువలన భూలోకవాసు లెల్ల మిక్కిలి హీనస్థితిలో నున్నారు. కృషి వాణిజ్య నిపుణశీలురగు వైశ్యపుంగవులు మిమ్మ్మగుఱించి తపం బాచరించి కైలాసమునందే నివసించియున్నారు. భూలోక మున వైశ్యపుంగవులు లేని కారణమున, ధనలేమిచే యట గల

వారలెవ్వరును కానుకలతో రాజాలకపోయిరి. రిక్తచేతులతో ముఖములు చూపింపజాలక సిగ్గిలి యెవ్వరును యిటకు రా సాహసింపలేకపోయిరి" అని వినయముతో ప్రత్యుత్తర మొసంగెను,

అప్పుడు త్రిలోకసంచారియగు నారద మునీంద్రుడు కూడ లేచి "దేవా! క్రియ విక్రియ నిపుణులు లేని దేనేల యైనను చవిటిభూమియే. పాడి లేని గోవు వంటిది. కావున భూలోకమున వైశ్యప్రముఖుల నిలబెట్టుట ప్రశస్తమని నాతలంపు. పైన దేవర చిత్తము" అని పలికెను. అందులకు పార్వతీపతి దీర్ఘముగ కొంతసేపు యోచించి, కుబేరునిగాంచి "కుబేరా! నారదుడు వివరించినదానిలో సత్య మెంతేని గలదు. కావున వైశ్యులు ద్రవ్యసమృద్ధితో భూలోకమందు వసించి క్రయవిక్రియములను కొనసాగించునట్లుగను, వారి ధర్మములు పాటించునట్లుగను యేర్పాటు గావించుము"అని ఆన తిడెను.

ఈశ్వరాజ్ఞానుసారముగా కుబేరుడు వెంటనే వైశ్య ప్రముఖుల రావించి, శివసందేశము వినిపించి "వస్తు పరిజ్ఞానము, క్రయవిక్రియములు గావించుటకు వైశ్యులు దప్ప తదితరులు అర్హులు కారు. భూలోక మిప్పుడు మీరు లేక యెడారి వలె నున్నది. కావున దేశసౌభాగ్యమునకై మీరు భూలోకవాసులు కాకతప్పదు" అని పలికెను.

అంత వారు పరమేశ్వరుని వీక్షించి "దేవదేవా! మేము భూలోకమున నెన్నియో కష్టము లంది, విసిగి తుదకు భవదీయ

రూపమునకై తపం బాచరించి తమ సన్నిధానమున వసింపగల్గి తిమి. ఆహ్లాదము నందుచుంటిమి. మా మురిపె మింకను సంపూర్తిగ తీరనేలేదు. మరల నిప్పుడు భూలోకమునకు పొమ్మని సెల వొసంగుచుండిరి. ఇది మా దురదృష్టమా ? మీ చరణసేవ నాచరింపు భాగ్యమింతలోననే మాకు లేకుండ బోవుటయా ! మమ్ము కరుణించవలెను''అని పెక్కువిధముల వేడుకొనిరి.

పరమేశ్వరు డంత ప్రసన్నవదనుడై వారిని గాంచి "వైశ్య శ్రేష్ఠులారా ! మీకు నాయందున్న భక్తి కెంతయు సంతసించుచున్నాను. మీరు భూలోకమున కేగుటకై విచారింపకుడు. కొన్ని శాపముల కారణములవలన మీకు భూలోక నివాసమును తప్పనది కాదు. భక్తులను విడిచి నేనుకూడ ఉండజాలను. కావున నేను నగరేశ్వరస్వామి నామమున నావిర్భవించి, వింధ్యవాసినిగ జనించు ఈ మీ మాత పార్వతిని పొంది మీ యానందము చూచి గొందును. అంతియేకాదు శ్రీమహావిష్ణువు కూడ లక్ష్మీసమేతుడై కోనకమల జనార్దన నామముల వెలసి మీకు కులదైవమై మీకుసదా సిరిసంపద లొసగుచుండును. ఇంకను మీకు సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు భాస్కరాచార్య నామమున జన్మించి గురువగును. ఆతని ధర్మబోధలతో మీకు సమస్త సౌభాగ్యములును కలుగగలవు కావునమీరు సంశయింపక భూలోకమునకుబొం''డనియాదేశించెను.

అంత నవ్వైశ్యులు మిక్కిలి ముదం బంది, పరమేశ్వరాజ్ఞానుసారము భూలోకమునకు పోదలచి గో గర్భ మం దొక దివ్య

వత్సరము గడపి, తదనంతరము గోపుకుడిచెవి రంధ్రమార్గమున పురుషులును, ఎడమచెవి మార్గమున స్త్రీలును జనించిరి. వెంటనే బ్రహ్మ వారికి జాతకకర్మ లాచరించి కుబేర విశ్వ కర్మ సమేతుండై నా వైశ్యులను దివ్య విమానంబునందు నెక్కించుకొని భూలోకంబున కరుదెంచి నవఖండములలో నుత్తమ మైన భరత ఖండమందు ఆంధ్రదేశములో సముద్రతీరమునకు సమీపముగా గౌతమీనది తీరమందు రమ్యమైన స్థలమందున శుభలగ్నమందు వాస్తు శాస్త్రప్రకారముగా నొక గొప్ప పట్టణమును నిర్మించెను. పట్టణమధ్యమందు వైశ్యులను, పశ్చిమ భాగమున బ్రాహ్మణులను, ప్రాగ్భాగంబున క్షత్రియులను, దక్షిణ ఉత్తర భాగంబుల యందు శూద్రులను ఉండునట్లు నిర్ణయించి దేవాలయములను తటాకములను మంచి మంచి వృక్షములుగల వనంబులను నిర్మించి నా పట్టణమునకు పెనుగొండయను నామకరణంబు జేసి అందు అనేక గోత్రజులగు వైశ్యుల నుంచి వారి స్వధర్మములను బోధించి వారి వద్దనుండి బయలుదేరి కైలాసంబునకు జని ఆ వృత్తాంత మంతయు ఈశ్వరుని కెరిగించి, తన లోకమునకు వెడలిపోయెను.

తరువాత వైశ్యప్రముఖులు పెనుగొండ క్షేత్రమున శ్రీ వింధ్యవాసిని నగరేశ్వరులను, శ్రీ కోనకమల జనార్దులను ప్రతిష్ఠించి, భైరవాది దేవతలను యధోచితముగ నిలబెట్టి పూజించుచు, పాత్రత నెఱిగి దానధర్మములను చేయుచు, వైశ్య (714) గోత్రజు లెల్లరు క్రియ విక్రియ వ్యాపారంబులు జరుపుచు, సకల భోగ భాగ్యంబులచే సుఖంబుగా నుండిరి.

మఱియు నా వణిక్పుంగవులు దేవతా పూజయందు, బ్రాహ్మణ సత్కారమునందు, అతిథి అభ్యాగతుల నాదరించుట యందు, స్వధర్మముల నాచరించుటయందు మిన్నలై ఖ్యాతి గడించుచు, దేశ మెల్లెడల వ్యాపించి, అనేక పట్టణముల నిర్మించుకొని సుఖంబుగా నుండిరి.

అని యిట్లు ధర్మనందనునకు సర్పరాజు వివరించి దెల్పగ ధర్మనందనుడు మిక్కిలి ముదంబున విని, తదుపరి వారలకు నమస్కరించి, వారివద్ద సెలవుపొంది వచ్చి తల్లిదండ్రులకుగురువుగారికి సంతసంబు కలుగజేసెను. తరువాత నతడు గుర్వానుమతిని జననీజనకులతో నిజ గృహంబును చేరుకొని సమస్త భోగములు నందగలిగెను.

ప్రథమ భాగము సంపూర్ణము.



# శ్రీ వాసవికన్యక

## (కన్యకాపురాణము)



## ద్వితీయభాగము

# శ్రీ వాసవీ కన్యక

## (కన్యకా పురాణము)

---

## ద్వితీయ భాగము

### కుసుమశ్రేష్ఠి దంపతులు సంతానలేమికై చింతిల్లుట.

వైశ్యప్రముఖుల కాకరమై వెలసిన పెనుగొండ పట్టణము మిక్కిలి శోభాయమానమై ధన ధాన్య సమృద్ధి కలదియై ఆ నాటి పట్టణములకెల్ల తలమానికమై ప్రకాశించుచుండెను. అందలి చతుర్వర్ణములవారును తమతమ ధర్మములను తప్పక న్యాయ శీలురై కాలము బుచ్చుచుండిరి. అందులో వైశ్యప్రముఖులు లక్ష్మీ కటాక్ష సంపన్నులై దేవబ్రాహ్మణ పూజల యందును, దానధర్మ ముల యందును, పేదసాదల నాదరించుటయందును ఏమఱక సదా సుఖోపేతులై యుండిరి. వైశ్యజాతిని గల 714 గోత్రములవా రును ఇట్లు ఆనందభావులై యున్నను, అందు పెండ్లికుల గోత్ర జుడును, సదాచార సంపన్నుడును, ధనసంపన్నుడను అగు కుసుమ శ్రేష్ఠి యను వైశ్యప్రముఖుడు మాత్రము అష్టైశ్వర్యములతో తులదూగుచున్నను సంతానవంతుడు కాకపోవుటచే దిగులు జెంది యుండెడివాడు.

అతని ధర్మపత్ని కుసుమాంబ. పతివ్రతా శిరోమణి. అన సూయా సతి కీడగు సద్గుణవతి. పతిహితానుసారిణియై మెలగు

చుండెడిది. కాని, సంతానచింతలో నామె పతికి పదిరెట్లు దురపిల్లు చుండెడిది. సంతానమునకై ఆమె ఎన్నియో వ్రతములు చేసెనది; నోములు నోచినది. కాని, ఆ భాగ్యవతి కోరిక తీరలేదు.

ఒకనాడు ఆ పుణ్యవతి భర్తపాదసేవ జేయుచు, ఖిన్న వదనయై యుండెను. కుసుమశ్రేష్ఠి సతియొక్క ఖిన్నవదనమును గాంచి వెరగుపడి "దేవీ! ఏమిది నేడిట్లుంటివి? చిరునగవులు వెదజల్లుచు నుండెడి నీ ముఖబింబము నేడు కళాహీనమై యుండు టకు కారణ మేమియో నేను వినవచ్చునా?" యని లాలించుచు నడిగెను. అందులకా సాధ్వి "నాథా! భగవంతుని అనుగ్రహము వలనను, తమ దయవలనను నా కిసుమంతయు లోటు లేదు. కాని, సంతానము లేని బాధయే నా మనంబును మిక్కిలి క్షోభ పెట్టు చున్నది. "అపుత్రస్య గతి ర్నాస్తి"యని గదా బుధ జనోక్తి. వేదములే "పుత్రులు లేనివారికి గతులు లే"వని చెప్పుచున్నవి. మనకు ఎన్నియున్నను ఏమి ఫలము? వంశోద్ధారకు డగు నొక్క తనయు డైనను లేడు. కావున అందులకై తగిన వ్రతమును గుఱించి, ఆచార్యులగు భాస్కరాచార్యుల వారితో సంప్రదించుడు" అని మిక్కిలి వినయముతో వేడుకొనెను.

## కుసుమశ్రేష్ఠి పుత్రకామేష్ఠి యాగము నాచరించుట.

కుసుమశ్రేష్ఠియు నీ విషయమున మిక్కిలి యోచనగల వాడై సతీమణి వాక్యములు మన్నించి, ఆ మఱునాడే యొక సభ

కావించి, దానికి యోగ్యులగు బ్రాహ్మణులను, భూత భవిష్యద్వర్తమాన శీలురగు జ్యోతిష్యులను, వేదపారీణులగు పండితులను, కులగురువులగు భాస్కరాచార్యులవారిని ఆహూతుల గావించెను. పిమ్మట నాతడు వచ్చినవారినెల్ల సగౌరవముగా పూజించి తన కోరిక నిట్లు విపులీకరించెను.

"మహానుభావులారా! పుణ్యశీలు రగు తమవంటి మహాత్ములను సాహసించి యిట సమావేశపరచిన దేమనగా :— భగవదనుగ్రహము వలనను, తమ ఆశీర్వాద బలమువలనను మాకు ఏ లోటును లేదు. ధన ధాన్య సంపదలో నెట్టి యిబ్బందియు లేదు. కాని, ఎన్ని యున్నను మాకు సంతానము మాత్రము లేకయున్నది. అందులకై మేము పెక్కు దానధర్మము లాచరించితిమి. వ్రతములు సల్పితిమి. నోములు నోచితిమి. తటాకారామాది సత్కర్మములను ఆచరించితిమి. అయినను మా కోరిక తీరలేదు. పరమేశ్వరునికి మాయెడ కనికరము కలుగలేదు. మా జీవితము లిక యింతియేనా? యోచించి మా కా సంగతి విన్న వింతురను దృఢనమ్మకముతో మిమ్మిట సమావేశపరచితిని. కావున కరుణించి తెలియజేయు" డని వినయవిధేయతలతో ప్రార్థించుకొనెను.

అప్పుడు వారెల్ల కొంతసేపు నిదానముగ ఆలోచించిరి. తదుపరి భాస్కరాచార్యులువారు యాతని గాంచి, "నాయనా! విచారింపకుము. తప్పక మీకు పుత్రోదయము కాగలదు. నీ జాతకరీత్యా కూడ పుత్రయోగము కలదనియే దైవజ్ఞులవారి వాదన.

మఱియు మీయింట సాక్షాత్ జగదీశ్వరియే జననం బందగలదని పలుకుచున్నారు. కావున మీరు చింతింప నవసరము లేదు. అయినను నా దొక సలహా ఏమనగా, పూర్వము దశరథభూపాలుడు పుత్రకామేష్ఠి యాగము నాచరించి శ్రీమన్నారాయణుని కుమారునిగా బడసినాడు. నీవుకూడ ఆ యాగము నాచరింపుము. అందువలన సకల సౌభాగ్యములును చేకూరగల''వని బోధించెను.

## శ్రీ వాసవీకన్యక జననము

కుసుమ శ్రేష్ఠియు గుర్వానతి తలదాల్చి వెంటనే యాగమునకై సకల సన్నాహములు సమకూర్చెను. పిదప గురోపదిష్ట ముహూర్తమున పత్నిసమేతుడై యజ్ఞగుండమున గూర్చుండి హోమము ప్రారంభించినాడు. ఆ పుణ్యదంపతుల పట్టుదలకు, శుచిత్వమునకు అగ్నిహోత్రుడు సంతోషించి పాయసకుంభముతో ప్రత్యక్షమై వారిని గాంచి ''పుణ్యదంపతులారా ! మీ భక్తికి సంతసించితిని. మీకు తప్పక సంతానము కలుగగలదు. ఇదిగో ! ఈ కుంభమునందు గల పాయసమును సేవించినచో, మీ కొక కుమారుడును, కుమారితయును కలుగగలరు. వారిచే మీ వంశమెల్ల తరింపగలదు'' అని పలికి, ఆ సుధాపాత్ర మొసంగి దీవించి యంతర్హితుం డయ్యెను.

అంత నా పుణ్యదంపతులు తమ కోరిక యీడేరి నందులకు మితిలేని కుతుకము నంది, ఆ మహా వేడుక సమయమనందే

అనేకముగా భూ, గో, ధన, వస్త్ర, వాహనాదుల దానముగా నొసంగిరి. తదుపరి పుణ్యసతి యగు నా కుసుమాంబ పావకు డొసంగిన పాయసమును ప్రమోదాంతరంగియై భుజించెను.

తత్ఫలితముగా నా సతీమణి గర్భవతియై నవమాసములు గడచిన వెనుక వైశాఖ శుద్ధ దశమీ శుక్రవారమురోజున సుముహూర్త శుభలగ్న ఘడియలలో నొక పుత్రరత్నమును, తదనంతరము పుత్రికారత్నమును గనెను. ఆ శిశువు లిరువురును పూర్ణిమా చంద్రుని ప్రకాశముతో నీడగు తేజముతో వెలుగుచు సౌందర్యోపేతులై ఉండిరి. అట్టి తమ సంతతిని మహదానందముతో వీక్షించు కుసుమ శ్రేష్ఠి, కుసుమాంబలకు, పుత్రికామణి యగు నా పసిబాల యొక్క పెట్టున కోటిసూర్య లుదయించినంత ప్రకాశము గలదియై, సర్వాభరణ భూషితురాలైన జగదాంబగా దర్శన మొసంగెను. అంత నా దివ్యదంపతులు అమందానంద కందలిత హృదయులై పరమేశ్వరికి సాష్టాంగ వందనము లాచరించి ఇట్లు స్తుతించిరి.

# పరమేశ్వరీ స్తోత్రము

శ్లో॥ గౌరీ మీం ధృతపంకజాం త్రినయనాం
శ్వేతాంబరాం సింహగాం
చంద్రోద్భాసిత శేఖరాం స్మితముఖీం
దోర్భ్యాం వహంతీం గదామ్

విష్ణ్వింద్రాంబుజ యోని కామత్రిదశైః
సంపూజితాంఘ్రిద్వయీం
గౌరీం మానసపంకజే భగవతీం
భక్తేష్టదాం తాం భజే॥

శ్లో॥ సకుంకుమ విలేపనా మళిక
చుంబి కస్తూరికాం
సమంద హసితేక్షణాం
సశర చాప పా శాంకుశాం
అశేషజన మోహినీ మరుణ
మాల్య భూషాంబరాం
జపా కుసుమ భాసురాం
జపవిధౌ స్మరా మ్యంబికామ్॥

శ్లో॥ చంద్రార్ధమౌళీం ద్విభుజాం త్రినేత్రాం
శూలాక్షమాలే సతతం వహంతీం
ఏణాసనస్థాం భుజగోపవీతాం
తా మన్నపూర్ణాం హృదయే స్మరామి॥

శ్లో॥ కైలాసాచల కందరాలయ కరీ
గౌరీ ఉమా శాంకరీ
కౌమారీ నిగమాంతగోచర కరీ
ఓంకార బీజాక్షరీ ।

మోక్షద్వార కవాట పాటనకరీ
కాశీపురాధీశ్వరీ !
భిక్షాం దేహి కృపావలంబనకరీ
మా తాన్నపూర్ణేశ్వరీ॥

శ్లో॥ త్రిలోచనాం సూర్యసహస్ర శోభాం
సింహాసనస్థాం ద్విభుజాం ధృతాసిం
పీతాంబరాం విష్ణు మహేశ సేవ్యాం
కామేశ్వరీం తాం హృదయే స్మరామి॥

ఇట్లు పెక్కుభంగుల నుతించిన యా పుణ్యదంపతుల భక్తిశ్రద్ధలకు పరమేశ్వరి మిక్కిలి హర్షించి, వారిని గాంచి "ఓ పుణ్యదంపతులారా ! లెండు. మీరు జన్మాంతరమున నన్ను పుత్రికగా బడయుటకై తపం బాచరించినారు. మీ కా జన్మమున నది నభఃపుష్ప మగుటచే, ఈ జన్మమున మీ కోరిక నెరవేర్చుటకై మీకు తనూజ నయితిని" అని పలికి యథాప్రకారముగా నా జగదాంబ మరల శిశువయ్యెను. కుసుమశ్రేష్ఠి దంపతులును దేవి మాయ వలన దివ్యజ్ఞానము తొలగి, ఆ బాలను తమ బాలగనే తలంచి యెత్తుకొని ముదం బందిరి.

క్రమముగా నా బాలలకు పదునొకండు దినములు జరుగగా కులగురువు లగు భాస్కరాచార్యులవారు శుభలగ్న ఘడియలలో జాతక కర్మాది క్రియల నాచరించెను. బాలునకు విరూపాక్ష శ్రేష్ఠి

అనియు, పుత్రికకు వాసవాంబ యనియు నామకరణము గావించెను. ఆ తరుణములో కుసుమశ్రేష్ఠి మహా సంతోషముతో విరివిగా దానధర్మములు ఒసంగెను.

తరువాత నా బాల లిరువురు దినదిన ప్రవర్ధమానులై శుక్ల పక్ష శపాకరునివలె నానాటికి పెరిగి పండ్రెండు సంవత్సరముల ప్రాయము వారైరి. అంత కుసుమశ్రేష్ఠి మిక్కిలి సంతసించిన వాడై భాస్కరాచార్యులవారిని రావించి కుమారుడగు విరూపాక్షునకు ఉపనయన మహోత్సవము గావింపజేసెను. పుత్రికయు వివాహ యోగ్యురాలగుటచే నా దంపతులు తమ పుత్రికకు తగిన వరునికై అన్వేషణాసక్తులై యుండిరి.

## చిత్రకంఠుడను గంధర్వుడు భూలోకమున విష్ణువర్ధను డను మహారాజుగ జన్మించుట

మహా శూరులును, చంద్రవంశజులును, మహాభారత కథా నాయకులును అగు పాండవులకు ఏడవ మనుమడుగా విష్ణువర్ధను డను మహారాజు జన్మించెను. ఈతడు గోదావరీ తీరమునగల రాజమహేంద్రవరమును రాజధానిగా జేసికొని భూభారము వహించి నాటి రాజలోకమున కెల్ల మిన్నయై ప్రకాశింపసాగెను.

(ఈ విష్ణువర్ధన మహారాజు గత జన్మమున నొక గంధర్వుడు. చిత్రకంఠు డను నామము గలవాడు. ఇతడు ఆ జన్మమున దేవకి యను వైశ్య కన్యకను వివాహమాడ ప్రయత్నించుటయు,

అది విఫలము కాగా, కామోద్రేకమున యుక్తాయుక్త విచక్షణ వీడి వైశ్యులను శపించుటయు, తత్ఫలితముగా నతడుకూడ శాప గ్రస్థు డగుటయు చదువరులు మఱచి యుండరు.)

విష్ణువర్ధనుడు సకలైశ్వర్యములతోడను ప్రకాశించుచు, మిక్కిలి బల పరాక్రమములు గలిగి అరివీర భయంకరుడై యుండెను. మఱియు, శరణాగతులను కాపాడుటలోను, ప్రజలను కన్నబిడ్డలవలెగమనించుటలోను.రాజకీయవిషయములనుసరిదిద్దుట లోను, దండయాత్రలు గావించి రాజ్యవిస్తరణము చేయుటలోను మిన్నయై పూర్వుల కీర్తికి నపవాదు గలుగకుండ ప్రజాపాలనము చేయుచుండెను.

## విష్ణువర్ధనుడు దండయాత్రకు బయలుదేరుట.

ఇట్లు ప్రజాపాలనము సాగించుచు విష్ణువర్ధన మహీపాలు డొక సమయమున, దిగ్విజయయాత్ర సేయదలచి చతురంగబల ముల వెంట నిడుకొని బయలుదేరెను. మధ్యతన్నెదిరించు పెక్కు- మంది రాజులను పరాజితుల సేయుచు కప్పములు గైకొనుచు క్రమక్రమముగ కల్యాణపట్టణము చేరుకొనెను. దానిని పాలించు చున్న మహారాజును గొప్పవీరుడే. అయినను ఆతడు విష్ణువర్ధ నుని ముందు "సూర్యకిరణ ప్రకాశముచే చీకటియెల్ల పటాపంచలై నట్లు" నిలువలేక పోయెను. అందుచే నా తేడు విష్ణువర్ధనునకు సామంతుడుగా నుండుట కొప్పుకొనెను.

తరువాత విష్ణువర్ధను డిట్లే పెక్కుదేశముల గెలిచి వెను కకు మరలి రాజధానికి పయనము సాగించి పెనుగొండ పట్టణ సమీపోద్యానవనముల కడకు చేరుకొనెను. అక్కడికి ఆ మహా పట్టణము రెండవస్వర్గమువోలె దేదీప్యమానముగ గోచరించుచుం డెను. అందుచే మహారాజు ముగ్ధుడై చారులను రావించి "ఈ పురము మిక్కిలి శోభాయమానముగ నున్నది. దీని పేరేమి? దీని నే భూపాలుడు పరిపాలించుచున్నాడు?" అని యడుగగా, వారు "మహారాజా! దీనిని పెనుగొండ పట్టణ మందురు. బహ్మా జ్ఞానుసారముగా విశ్వకర్మ దీనిని నిర్మాణ మొనర్చెను. కావుననే యిది స్వర్గమునకు తుల్యమై యున్నది. ఈ పట్టణమును బహ్మదే వుడు వైశ్యప్రముఖులకు దానముగా నొసగెను. వారు ఈపురమును సర్వసమ్మతముగా పరిపాలించుచు సకల వైభోగములతోడను సుఖముగా నున్నవారు" అని వినయముతో విన్నవించుకొనిరి.

## వైశ్య ప్రముఖులు విష్ణువర్ధన మహారాజును అతిథిగా ఆహ్వానించి పురమునకు గొనివచ్చుట

ఇట్లు మహారాజును, చారులును మాట్లాడుకొనుచుండగా, ఈ సంగతి తెలిసిన పెనుగొండపట్టణ భూపాలకులు ఆ మహారా జును సత్కరింపదలచి అమూల్యములగు కానుకలతో చనుదెంచి, అవి సమర్పించి "పట్టణమునకు అరుదెంచి పవిత్రము చేయు"డని వేడుకొనిరి. మహారాజునకు కూడ నా పురముయొక్క సోయగ

మును వీక్షింపవలె నని యుండుటచే మిక్కిలి ముదమంది వారిని తగురీతి సత్కరించి ''రేపు పురప్రవేశ మొనర్తు''మని సమాధాన మొసగి వారిని బంపివైచెను.

మఱునాడు విష్ణువర్ధనుడు సపరివారముతో పట్టణప్రవేశము గావించెను. ఆతని రాకకై వేచియున్న వైశ్యప్రముఖులు సగౌరవముగా నెదు రేగి తీసికొని వచ్చి శ్రీ నగరేశ్వరస్వామి ఆలయమున గొప్ప విందు కావించిరి. విష్ణువర్ధనుడు సంతోషముతో ఆ విందును గైకొనెను. తదుపరి మహారాజు శ్రీ నగరేశ్వరుని తీర్థప్రసాదములను తీసికొని పురమును తిలకించుటకు తగుపరివారముతో కొంత మంది వైశ్యపుత్రులు వెంబడింప బయలుదేరెను.

## విష్ణువర్ధన మహారాజు పుర సౌయగమును గనుచు శ్రీ వాసవీ కన్యకను జూచి మోహించుట.

మహారాజిట్లు పురవైభవములను జూచుటకు బయలువెడలి దాని సౌయగమును గని మెచ్చుచు నల్లనల్లన వెడలుచుండెను. క్రమముగా నా భూపతి అట గల రాజమందిరములను, దేవతా మందిరములను, మిన్నంటి యున్నవా ? అనునట్లున్న ఉన్నత సౌధరాజములను, ధనికులగు వైశ్యపుంగవులయొక్క భవనములను, అందలి మణి నిర్మిత నిర్మాణ నైపుణమును తిలకించుచు జనుచుండెను. రారాజు అగు విష్ణువర్ధనుడు పురమును గాంచ దిరుగుచుండ. ఆతని జూచుటకై పెక్కుమంది నగరవాస్తవ్యులు

తండోపతండములై ప్రతివీధియందును మహోవేడుకతో గుంపులు గూడియు, బారులుదీర్చియు నిలువబడి యుండిరి.

విష్ణువర్ధనుడు పట్టణప్రజలు చూపు ఆదరాభిమానములు చూరగొనుచు క్రమక్రమముగా కుసుమశ్రేష్ఠి నివసించుచున్న వీధిలోనికి వచ్చెను. అప్పటికి సాయంకాలము అయిదు గంటలు కావచ్చినది. అందువలన శ్రీ వాసవీకన్యక శ్రీ నగరేశ్వరస్వామి సందర్శనార్థమై ఒకరిద్దరు సఖురాండ్రు వెంబడింప దేవాలయము నకు బయలుదేరెను. ఇట్లు చెలులతో నిలు గదలి వచ్చుచున్న శ్రీ వాసవీకన్యక మహారాజు దృక్పథమున బడి యాతని చకితుని గావించెను. చంద్రునిమించిన ప్రకాశముతో రెండవ జగన్మోహిని వలె నున్న ఆ దివ్యమంగళ స్వరూపము మహారాజు హృదయ ఫలకమున ముద్రిత మైపోయినది. అందుచే నాతడు మోహాక్రాంతుడై తాను బయలుదేరిన పనినికూడ మఱచి నిశ్చేష్టితు డయ్యెను. "ఈ కన్యక యెవరు ? మానవకాంతయేనా ; లేక దివిజ భామినియా ? మానవకాంతల కింత సౌందర్య ముండునా ? రంభ, ఊర్వశి. అప్సరస స్త్రీలను తలదన్ను సురూప లావణ్యాదులు గల్గియున్న యీ తన్వి యెవరో గ్రహించి చేపట్టవలెను." అను నిటువంటి తలంపులతో నా మహారాజు ముందునకు పయనము సాగించుచు, వెంటనున్న వైశ్యపుత్రులను తిలకించి "ఈ సుందరాంగి యెవరు ? ఆమెనామ మేమి ? తలిదండ్రు లెవరు ? అవివాహిత యేనా ?" అని ప్రశ్నించెను.

అందులకు సమాధాన మొసగుటకు వైశ్యపుత్రులు మొదట కొంచము జంకిరి. కాని ధైర్యము తెచ్చుకొని "మహారాజా! ఈ అందాలరాశి మా వైశ్యుల పుత్రికయే. నగరపాలకులగు కుసుమశ్రేష్ఠి తనూజ. పేరు వాసవీదేవి. కుసుమశ్రేష్ఠికి చిరకాలము వరకు సంతానము కలుగలేదట! అందుచే నతడు పుత్రకామేష్ఠి యాగము గావింపగా వారిభక్తికి మెచ్చి అగ్నిహోత్రు డమృత తుల్యమగు పాయసము నొసగెనట! తత్ఫలితముగా నా దంపతులకు ఒక కుమారుడును, ఒక కుమారితయును గలిగిరి, ఆ కుమారితయే యిప్పు డిటు వెళ్ళిన వాసవాంబ. ఈమె యన్న విరూపాక్ష శ్రేష్ఠి ఆతడు మా కులగురువులగు భాస్కరాచార్యులవారి యనుగ్రహమున విద్యాపరిపూర్ణుడై ప్రకాశించుచున్నాడు. విద్యలలో నీ కన్యకయుకూడ అన్నగారికి తీసిపోవునది కాదు. ఇరువురిలో నేరికిగూడ నింకను వివాహము కాలేదు" అని సమాధాన మొసగిరి.

మహరాజా వాక్యముల నెల్ల సావధానముగ నాలకించి అచ్చటనుండి బయలుదేరి యాతడు పురసోయగములను కూడ తిలకించుట మానియే, వెనుకకు మరలి తనకై యేర్పరుపబడిన విడిదిగృహమునకు చేరుకొనెను.

నాటిరాత్రి విష్ణువర్ధనుడు భోజనానంతరము శయ్యపై జేరెనేగాని నిద్రాధిదేవత యాతని సమీపమునకైన చేరలేదు. వాసవాంబయే కన్నులముందు తాండవించుచుండెను. త్రిజగన్మోహనాకారమగు ఆ సౌందర్యము, ఆ మంధగమనము, ఆ వయ్యా

రము, ఆ విలాసము చిత్రసీమయందలి చిత్తరువులవలె నొక్క టొకటిగా నాతని కనులముందు గోచరింపసాగెను. మహారాజిట్లు కలగిన హృదయముతో నిదురింపక పరిపరి విధముల నాలోచించుచు ఆ కన్యకను నే రీతి బొందవలయు ననెడి యోచనలతో లేచి అటునిటు పచారు చేయసాగెను.

మహారాజు పరిస్థితి నంతయు గమనించు చుండిన మంత్రి శేఖరు డగు విజయసింహు డప్పు డాతని సన్నిధికి వచ్చి "మహా రాజా! రాత్రి రెండవ యామముకూడ గడచిపోయినది. తా మింకను దీర్ఘాలోచనలందే సమయమును గడుపుచున్నారు. అంత ఆలోచింపదగిన రాచకార్యము లున్నట్లు నేను భావింపజాలను. ఇంక ఆంతరంగికముగా నేమైన కోరిక లున్న తెలియజేయుడు. ఈ దాసుడు మీకార్యనిర్వహణా భారమును మోయగలడు" అని వినయముతో ప్రశ్నించెను.

మహారా జప్పుడు తన పరిస్థితిని మంత్రిపుంగవుడు పసి కట్టినందులకు సిగ్గుపడి, ఆతనిని జూచి "విజయసింహా! నీవద్ద నాకు దాపరిక మేల? వినుము, నిన్న మనము పురవింతలుచూడ బోయినపుడు గాంచిన వాసవీకన్యక నా హృదయము నపహరించినది. అంతటి సౌందర్యవతుల నేనింతవరకును చూచియెరుగను. కావున నామె వివాహమునకు ఒప్పుకొనునట్లు గావింపుడు"అనెను.

విజయసింహు డా వాక్యముల నాలకించి "మహారాజా! ఇందులకు మీరింత యోచింపవలయునా? నేనిప్పుడే పోయి

ఆ కన్యక గుఱించి అన్నివిషయములును చర్చించి వివాహమునకు ఏర్పాటు గావించెదను. ఆమె తలిదండ్రులు నిరాకరించినచో బల వంతముననైనను మీ కా కన్యకను గొనివచ్చి పరిణయము గావింతును" అని పలికి రాజాజ్ఞ నేరవేర్చుటకై పూనుకొనెను.

## విజయసింహుఁడు వాసవాంబ పెండ్లిని గుఱించి కుసుమశ్రేష్ఠితో ఆలోచించుట.

మఱునాఁ డుదయముననే విజయసింహుఁడు ఇరువుర భటులను బంపి కుసుమశ్రేష్ఠిని తన బసలోనికి పిలిపించుకొనెను. తదుపరి యతనిని సగౌరవముగా కూర్చుండజేసి మహారాజు కోరికను విశదీకరించెను. ఆ మాటలు విని, కుసుమశ్రేష్ఠి "మంత్రి పుంగవా! వివాహ మనునది నా యొక్కనిచే కొనసాగునది కాదు. బంధువులు సమ్మతింపవలయును; కన్యక ఒప్పుకొనవలెను. కావున ఈ విషయమును మా వారల కెఱిగించి తమకు బదులు పలికెద"నని సమాధాన మొసగెను.

విజయసింహుఁ డప్పుడు "వైశ్యపుంగవా! నీ వనునది సత్యమే. అయినను ఇందు ప్రధానపాత్రి నీదియే. నీ వొకఁడవు సమ్మతించిన, తక్కినవారును ఆమోదింపగలరు. కావున నీవు సరే యనుము. నీవు సమ్మతింపకున్నను ఈ వివాహ మాగునది కాదు. బలవంతముగ నైనను మీ కన్యను మేము గొనితేగలము. ఇది మాత్రము మఱువబోకుము" అని బెదరించెను.

ఇంతలో విష్ణువర్ధనుడు అక్కడకు వచ్చెను. ఆయనను గాంచి వారు తగు గౌరవము గనబఱచిరి. తరువాత మహారాజు కుసుమశ్రేష్ఠితో "మీ మాటలు కాదన నేల ? మీవారితో నాలోచించుకొనియే మాకు వర్తమానము బంపుడు. ఇది మాకుగూడ సమ్మతమే" నని పలికి అతనిని సగౌరవముగా బంపివేసెను.

## వాసవాంబను మహారాజున కొసగుట గుఱించి కుసుమశ్రేష్ఠి కులమువారితో నాలోచించుట.

గృహమునకు చేరినవెంటనే కుసుమశ్రేష్ఠి, వైశ్యపుంగవులను రావించి, ఒక సభ ఏర్పాటు గావించెను. ఆ సభకు కులపు పెద్ద లందఱు విచ్చేసిరి అప్పుడు కుసుమశ్రేష్ఠి వారలకు — మంత్రిపుంగవుడు తన్ను పిలిపించుటయు, అతని బెదరింపు వాక్యములు, మహారాజు పలికిన వాక్యములు — మొదలగున వన్నియు స్పష్టముగ విశదీకరించి "ఇప్పుడు మన మేమి చేయవలయును?" అని ప్రశ్నించెను. అప్పుడు కొందరు వైశ్యులు లేచి "మహారాజు జామాత అగు అదృష్టము ఎంతటివారికి ? కావున ఆనందముతో అంగీకరింపవచ్చును" అని పలికిరి. మఱికొందఱు దూరాలోచన గల వైశ్యప్రముఖులు లేచి "తొందరపడుట మంచిది కాదు. అన్యకులజు డెంత గొప్పవాడైనను కన్యనొసగుట శ్రేయస్కరము కాదు"అని పలికిరి.

ఇట్లు ఆ సభ రెండుభావములు గలిగి, ఎంతసేపటికిని ఏకభావమునకు రాకుండుటజూచి యుక్తిపరుడగు నొక వైశ్యపుంగ

వుడు లేచి "సభాసదులారా! మనలో మన మిట్లు వాదించుకొనుచు కాలయాపన గావించుటమంచిదికాదు. మహారాజునకుఏసంగతియు దెలుపకున్నచో హాని చేకూరగలదు. ఆత డిప్పుడు సైన్యసమేతుడై యున్నవాడు. మఱియు కామమునకు లొంగి యున్నవాడు. మనమిప్పుడు కాదన్నచో నతని కేమి దుర్బుద్ధి పుట్టునో ఏమో! కావున మంచిమాటలతో మన మిప్పుడు వానిని వాని పట్టణమునకు తరలింతము. లేనియెడల వారు బలవంతముగ నైన మన కన్యకను గొనిపోక మానరు. వాని నెదురించు నంతటి బలమా? మనవద్ద లేదు. కావున ఉపాయముతో మన మీ గండమును దాటవలెను. తదుపరి మనము గురువుగారితోను, మన గోత్రిజు లందరితోను విచారించి కర్తవ్యము యోచింతము"అని పలికెను.

ఆతనివచనముల కట గల వారెల్లరు సమ్మతించిరి అందుచే కొంతమంది వైశ్యబాలకులచే మహారాజునకు వాసవాంబ నొసగుదు మను సందేశమును పంపుటకు నిశ్చయించుకొనిరి.

## వైశ్యబాలకులు మహారాజును దర్శించి వాసవాంబ నొసగుదుమని బలుకుట.

అనుకొనిన మేరకు, వైశ్యబాలులు కొంతమంది కానుకలతో మహారాజును దర్శించి, తాము గొని వచ్చిన కానుకలను సమర్పించుకొనిరి. మహారాజును తన కోరిక సఫలీకృత మైనదనియే భావించి మిక్కిలి ఆనందముతో వారికి యుచిత సత్కార

ములు గావింపజేసెను. తరువాత మహారాజు వారిని వచ్చినపనికై ప్రశ్నింపగా, వారు "మహారాజా! తమకు వాసవాంబ నొసగుట మాకు సమ్మతమే. ఈ శుభవార్త తమకు తెలియజేయుటకే మేము వచ్చితిమి. కావున తాము ముహూర్తమునకు లగ్నమును నిశ్చయింపవచ్చును" అని పలికిరి.

మహారాజు వారి మాటలకు ఆనందమంది వెంటనే జ్యోతిషులను బిలిపించి ముహూర్తము నిశ్చయింపు డని బలికెను. ఆ జ్యోతిషులును వైశ్యపుంగవుల వలన రహస్యముగ బహుమానము లందియుండుటవలన వారి కోరిక దీర్చుటకై నిశ్చయించుకొన్నవారై యుండుటచే-వారు కొంత సేపు పంచాంగములు తిరుగవేసి "మహారాజా! ఇంతలో వివాహమునకు యోగ్యమగు లగ్నములు కనబడుట లేదు. మాఘశుద్ధ విదియా గురువారము ఉదయము 8-30 లకు వధూవరులకు చంద్రబలము తారాబలము చక్కగా నున్నది. కావున ఆ ముహూర్తము నిశ్చయింతుము" అని పలికి ఆ ముహూర్తమును స్థిరపరచిరి. అందులకు మహారాజు కూడ ఆనందముతో సమ్మతించి బ్రాహ్మణులకు విరివిగా దానము లొసగి పంపివైచెను. వైశ్యకుమారులు కూడ మహారాజువద్ద సెలవు తీసికొని వెడలిపోయిరి. తదనంతరము విష్ణువర్ధన భూపాలుడు సపరివారముతో బయలుదేరి రాజధానికి చేరుకొనెను.

## వాసవాంబ వివాహ విషయము గురించి చర్చించుటకై పదునేడు పట్టణముల వైశ్యులు సభ జేయుట.

విష్ణువర్ధనుడు రాజధానికి తరలిన మఱునాడే కుసుమశ్రేష్ఠి కులగురువులగు భాస్కరాచార్యులవారితో సంప్రదించి వారి యాజ్ఞానుసారముగా పురోహితులద్వారా పెనుగొండ పట్టణమునకు దాపున నున్న పదునేడు పట్టణములయొక్క వైశ్యపుంగవులను రావించెను. వచ్చినవారిని కుసుమశ్రేష్ఠి సగౌరవముగా ఆదరించి పిదప, శ్రీ నగరేశ్వరస్వామి ఆలయమున నొక మహాసభ ఏర్పాటు గావించెను. ఆ సభలో ఏడునూట పదునాలుగు గోత్రజులగు వైశ్యపుంగవు లెల్ల విచ్చేసి యుండిరి.

అప్పుడు సభకు పెద్దగా భాస్కరాచార్యులువారు నిలబడి "ఓ వైశ్యపుంగవులారా ! ఇప్పు డిటకు మిమ్ముల నందరను పిలిపించుట యొక ముఖ్యమగు విషయముగుఱించి యోచించుటకు. అది మన కులధర్మ విషయము. కావున మీ రెల్లరు బాగుగా యోచించి ఒక నిర్ణయమునకు వచ్చినచో అదే ప్రకారముగా గావింతము" అని పలికి విష్ణువర్ధన మహారాజు వచ్చినది మొదలుకొని వెడలువరకు జరిగిన కథ యంతయు పూసగ్రుచ్చినట్లుగా నెల్లసంగతులు విశదపరచెను.

మఱియు భాస్కరాచార్యులవారు వారిని కనుగొని "వణిక్పుంగవులారా ! మహారాజు దండుతో మన పట్టణమున విడిసి

యుండుటవలనను, బలవంతు డగుటవలనను. కాదన్నచో నగర మున కే హాని తలపెట్టునో యను భీతివలనను మనవారు మహా రాజునకు ఆశ జూపించి పంపివేసిరి. కాని, మన కులధర్మమును బట్టి బాగుగా యోచించినచో 'అన్యకులజు డెంత మహాధన సం పన్నుడైనను కన్యక నీయరా' దను ధర్మము గోచరించుచున్నది. మదోన్మత్తులగు రాచవారితో మనవంటి సాధుపురుషులు వియ్య మందుట చరిత్రలో నింతవరకు కనలేదు; వినలేదు. ఇప్పుడే యిట్టి అవాంతర మొకటిప్రత్యక్షమైనది. దానికి లొంగుటయా? లేక ఎదిరించుటయా మనము నిర్ణయింపవలసిన దిదియే" అని పలికెను.

భాస్కరాచార్యులవారి వాక్యముల విని సభికు లందరును కొంతతడవు దీర్ఘముగా నాలోచించిరి. తరువాత వారిలో (612) ఆరువందల పండ్రెండు గోత్రములవారు మహారాజు సంబంధము నకు సమ్మతించి యిట్లు పలికిరి. "విష్ణువర్ధన మహారాజు రారాజు మాత్రమే గాక చాల ఉత్తముడు. వీరుడు. నిదానము గలవాడు కూడ. కాదేని మనకన్నియను ఆ నాడె బలవంతముగ నపహరిం చియుండును. చేతిలో తగినంత బల ముండియు మనపై విశ్వాస ముంచినాడు. ఆతని ఉత్తమగుణముల కిదియొక నిదర్శనము. అట్టి యోగ్యునకు మన వాసవాంబ నొసగినచో ఆమె సుఖించు టయే గాక, తద్వారా మనకును, మన వాణిజ్యమునకును ముందు ముందు మంచి లాభము కాగలదు కావున ఆ మహారాజు సంబంధ మంగీకరింపవలసినదే. అదియును గాక, వాసవాంబ నొసగెద

మని చెప్పియుంటిమి. ఆయన మనలను నమ్మి ఆశతో ఆనంద
ముతో రాజధానికి చేరుకొనినాడు. బహుశః పెండ్లిసన్నాహములు
కూడ విరివిగా చేయించుచుండవచ్చును. ఇప్పుడు మనము కాద
న్నచో, ఆ భూపతి తప్పక ప్రళయకాల రుద్రుడు కాగలడు. మహా
రాజులు అవమానమును భరింపజాలరు. కావున, ఆతడు మన
నాశనమునకై యత్నింపవచ్చును. కావున అన్నివిధముల నతనికి
మన కన్నియ నొసగుటయే శ్రేయస్కరము" అని పలికిరి.

కాని, వారి వచనములు ఖండించుచు మిగిలిన (102) గోత్రములువారు యిట్లు బలికిరి. "అన్యకులజునకు కన్య నొసగుట మిక్కిలి గర్హించదగినది. రారా జనియు, వీరుడనియు, యోగ్యుడనియు తలచి వర్ణసంకరమునకుపూనుకొనుట చాలతెలివితక్కువ ప్రస్తుత మా యాపదనుండి గట్టెక్కుటకు మనవారు కన్య నొసగుదుమని పలికినారు. అంతియే. ఇది సత్యము కాదు. అవసరమును బట్టి యొక్కొక్కసారి అసత్య మెంతవారైనను అవలంబింతురు. ఇంతమాత్రమునకే మనకు పాతక మంటుకొనజాలదు. మన మింతదానికై అన్యేతరునికి కన్య నొసగినచో మఱింత పాప మార్జించుకొన్నవారమే అగుదుము గాని, పుణ్యశీలురము కాజాలము. మన పిల్ల సుఖించుననియు, మన వ్యాపారములు వృద్ధి నొందు ననియు తలంచుట కేవలము భ్రాంతియేగాని వేరు కాదు. అదృష్టమును బట్టి ఎవరి కెయ్యవి సంప్రాప్తము కావలెనో, అవి జరుగక మానవు. కావున వాసవాంబను విష్ణువర్ధనునకు ఇచ్చి వివా

హము గావించుట మా కెంతమాత్రము సమ్మతము కాదు. ఇప్పుడు మనము రాయబారము పంపి "కన్య నొసగ"మని మంచిమాట లతో చెప్పించెదము. ఆతడు యోగ్యుడు, మంచివాడు, నిదానము గలవాడు అయి సమ్మతించెనేని మంచిదియే లేక క్రౌర్యమునకు పూనుకొని దండెత్త వచ్చి మనలను జయించి వాసవాంబను బల వంతముగా పెండ్లి చేసికొన దలచెనేని ఆ నాటి సంగతి చూచు కొందము. అంతియేగాని కన్య నొసగుట మాత్రము మంచిది కాదు" అని వారు తమ యుద్దేశమును వెలిబుచ్చిరి.

అప్పుడు భాస్కరాచార్యులువారు బాగుగ యోచించి రాయ బారము పంపుటయే శ్రేయస్కర మని తలంచి, అందుకు తగిన వయోవృద్ధులు, అనుభవజ్ఞులు నగు కొంతమంది వణిక్పుంగవు లను నియోగించెను; బయలుదేరుటకు వారును అంగీకరించిరి. అంతటితో సభ ముగిసినది. అందరును వారివారి బసలకు చేరు కొనిరి.

## విష్ణువర్ధన మహారాజు వద్దకు వైశ్యపుంగవులు రాయబారులుగా వెళ్లుట.

మరునాడు విష్ణువర్ధనుని కడకు రాయబారముగా వెడలు టకు నిర్ణయింపబడిన వైశ్యపుంగవులు అమూల్యములగు కానుక లను తీసికొని బయలుదేరి రాజమహేంద్రవరమునకు చేరుకొనిరి. వారి రాక తెలిసికొనిన మహారాజు మహా సంతోషముతో నెదురేగి

మర్యాదగా సత్కరించి సభామండపమునకు గొనివచ్చి వారిని యుచితాసనములపై కూర్చుండజేసెను.

అప్పుడు వైశ్యరత్నములలో నుండి యొక వృద్ధ తరుడు లేచి మహారాజునకు కభివాదము సల్పి, తాము గొనివచ్చిన కాను కలను సమర్పించి "మహారాజా! మే మొక కార్యార్థమై రాయ బారులుగా వచ్చితిమి. మా సందేశమును విని మమ్మాదరింతురని నమ్మకముతో చనుదెంచితిమి. పైన దేవరవారి చిత్తము" అని పలికి, తాముగొని తెచ్చిన సందేశము నిట్లు తెలియజేసిరి.

"మహారాజా! తమరు మా వైశ్య కన్నియ యగు వాస వాంబను వివాహమాడగోరితిరి. కాని, అది న్యాయసమ్మతముగా లేదు. ఒక వంశజులు వేరొక వంశజుల కన్యలను వాంఛించుట నరక హేతువు. సింహము సింహమునే అభిలషించునుగాని పెద్ద పులి నీడనైన కనుగొనజాలదు. అట్లనే మా కన్నియ స్వజాతి బాలకునే వాంఛించునుగాని వర్ణసంకరమునకు దోహద మొసగ జాలదు. కావున మా యందనుగ్రహముంచి మా వాసవాంబపై గల మమకారమును విడనాడుడు. తాము అన్నియు తెలిసినవారు. మేము చెప్పదగినంత వారము కాము. అయినను విషయము మాయందుండ బట్టి యింతగా చెప్పవలసినది. ఇందుకు క్షమింప వేడెదము" అని పలికెను.

మహారాజునకు ఆతడు నుడువుచున్న ఒక్కొక్క వాక్యము ఒక్కొక్క బాణమువలె పని చేయుటచే నొడలు దెలియని కోపా

వేశముతో సింహాసనమునుండి దిగ్గున లేచి "చాలించుడు మీ ధర్మ పన్నములు. మాట యిచ్చి ఇప్పుడు కాదందురా? ఇదియేనా మీ మర్యాద? మీరు మాట తప్పినను మేము తప్పము. ఎప్పుడు మేము ఆ కన్నియను కనుగొంటిమో అప్పుడే ఆమెను మా హృదయాధిదేవతగ నిశ్చయించుకొంటిమి. అయినను ఆచారముగావున మి మ్మడిగితిమి. మీరు కాదన్నంతమాత్రమున వాజమ్మవలెవిడిచి పెట్టుదునా? అట్లెన్నడు కాబోదు. మొదట లగ్ననిర్ణయము కావించి, నేడు ఇష్టము లేదని ధర్మోపదేశము కావించుచున్నారా? మంచిది, ఇప్పుడెవ్వ రడ్డు వచ్చెదరో నేను చూచెదను. వాసవీ కన్యక పరిణయము నాతో జరిగితీరవలసినదే. మీ సమ్మతితో నా కెంతమాత్రము పనిలేదు" అని పలికి, రాజభటులను పిలిపించి "మీరు వెంటనే పెనుగొండ పట్టణమును ముట్టడించుడు. ఒక్క పురుగునేనియు బయటకు పోనీయకుడు. మేమును వివాహసన్నాహములతో నేటరేపటిలో బయలుదేరి వచ్చెదము. అడ్డుదగిలినవారిని హతమార్చియైన వాసవికన్యకను పొందుదునే కాని విడుచువాడను కాను" అని రాజకింకరులకు ఆనతిడి పంపివేసెను.

తదుపరి మహారాజు వైశ్యుల నవలోకించి "మీరు రాయబారులుగా వచ్చినవారు కావున దయదలచి విడుచుచున్నాను. ఇంకొకరీ వార్త గొనివచ్చినచో ఈ సరికి యమసదనము జూచియేయుందురు. పొండు. ఈ సంగతి మీ వారికి తెలియజెప్పి పిచ్చిపిచ్చి వేషములకు పోకుండ, పెండ్లి ప్రయత్నమున నుండుడు" అని పలికి వారలను సురక్షితముగ బంపివైచెను.

## రాయబారులుగా పోయిన వైశ్యపుంగవులు తిరిగి వచ్చి రాజాజ్ఞ వినిపించుట.

వైశ్యపుంగవు లట్లు మహారాజుచే విడువబడినవారై తిరిగి పెనుగొండ పట్టణమునకు చేరుకొనిరి. వారి రాకకై నిరీక్షించు చున్న వైశ్యబృంద మెల్ల ఆ రాయబారులకు నెదురేగి దోడ్తెచ్చిరి. పిదప శ్రీ నగరేశ్వరస్వామి ఆలయమువద్ద నొక సభ ఏర్పాటు గావింపబడెను.

అప్పు డా సభలో రాయబారులగు వైశ్యపుంగవులు లేచి - విష్ణువర్ధన మహారాజును దర్శించుటయు, తాము బోధించినదియు, అంచుల కాతడు కోపించి పలికిన పలుకులు, రాజభటుల కొసగిన ఆనతియు - విపులముగా తెలియజేసెరి.

## భాస్కరాచార్యులవారు వైశ్యులయొక్కయు, మహారాజుయొక్కయు పూర్వజన్మకథ తెలియజేయుట.

ఆ సంగతి యంతయు విని సభికు లెల్లరు "ఇప్పుడేమి చేయవలయునా?" అని ఆలోచింప సాగిరి. అప్పుడు భాస్కరా చార్యులవారు లేచి "వైశ్యపుంగవులారా! ఇందులకు మీరు విచా రింపవలసిన పనిలేదు. పూర్వజన్మ కర్మానుసారముగా ప్రతి కార్య మును జరుగుచుండును. ఇప్పు డీ విష్ణువర్ధనుడు పూర్వజన్మమున కూడ వైశ్యజాతికి శత్రువుగనే యుండెను. ఆ కథ మీకు క్లుప్త ముగా వివరించెదను. విను"డని యిట్లు చెప్పసాగెను.

పూర్వము వైశ్యులు ఈశ్వరునిగూర్చి ఘోరమగు తపస్సు చేయగా, వారి భక్తికి శంకరుడు మెచ్చి ప్రత్యక్షమయ్యెను. అప్పుడు వైశ్యపుంగవులు పరమానందముతో సదాశివుని స్తుతింపగా, ఆతడు ముదమంది, వారు కోరిన ప్రకారము వైశ్యుల నెల్ల కుటుంబము లతో సహా కైలాసమునకు గొంపోయెను. కైలాసమునందు ఈశ్వ రుని ధ్యానించుచు సేవలు చేయుచు ప్రకాశించుచుండిరి.

అట్లు కొంతకాలము జరిగినది. అప్పటికి వైశ్యులలో శంభుశ్రేష్ఠి అను శివభక్తునకు దేవకి యను పుత్రిక కలిగియుం డెను. ఆమెయు శివభక్తి గలదియై లావణ్యవతియై ప్రకాశింప జొచ్చెను. ఒకరోజున ఆ కన్యక గౌరీనాథుని పూజించి తిరిగి గృహమునకు వచ్చుచుండగా, మధ్యమార్గమున చిత్రకంఠుడను గంధర్వు డొకడు దేవకిని చూచి మోహావేశము నొందెను. చిత్ర కంఠుడును శివ భక్తుడే ; సన్మార్గశీలుడే, అయినను విధివిలాసము నెవరును గమనింపజాలరుకదా !

దేవకిపై గల మోహమువలన చిత్రకంఠుడు శంభుశ్రేష్ఠిని దర్శించి "మీ తనయను నా కొసగు" మని యర్థించెను. అందుల కాతడు సమ్మతింపక, వైశ్యపుంగవులతో నాలోచించెను. అనుభ వజ్ఞులగు నా వైశ్యులుకూడ "గంధర్వులకును, మనకును వియ్య మెట్లు పొసగును ? అన్యకులజులకు కన్య నొసగు యాచారము మనలో లేదు" అని పలికి గంధర్వునికి "మా కన్యక నొసగ" మని నిష్కర్షగా జెప్పివైచిరి. అందులకు చిత్రకంఠుడు కోపించి "మీ కన్య నపేక్షించి మిమ్ము వేడుకొనగా మీరు నన్ను చులక

నగా జూచి నా కోరికను నిరసించితిరి. కావున మీరు భూలోక వాసులై ఒక కన్యక మూలముననే అగ్నిలో పడి దగ్ధులగుదురు గాక!" అని శపించెను. అప్పుడు మన వైశ్యులుకూడ దివ్యసంపన్నులగుటచే వానిని జూచి "నిర్దోషులమయిన మమ్ముల నకారణముగా శపించితివి. కావున నీవు దివ్యత్వమును బాసి భూలోకమున రాజువై పుట్టి, మా కులకన్యకనే వాంఛించి, ఆమెను పొందకయే విరహాగ్నిచే క్రమ్మగ్గి, చివరకు తల బ్రద్దలై మరణించి,తిరిగి దివ్యత్వమును పొందుదువుగాక!" అని ప్రతిశాపంబును, శాపాంతమును ఒసగిరి.

తత్ఫలితముగా వైశ్యులెల్లరు భూలోకమున తిరిగి జన్మించిరి. చిత్రకంతుడుకూడ మహారాజు గర్భమున జనించెను. ఈ విష్ణువర్ధనుడే ఆ చిత్రకంతుడు. ఆ నాటి శాపమువలన నతడు మన కన్యకయగు వాసవాంబను కోరుచున్నాడు. కావున విధివిలాసముచే జరుగు నీ యాపదకు మనము వగచుట మంచిదికాదు. మన కులధర్మముకొరకు మనమును ఈ సమయమున ప్రాణత్యాగమొనర్చితిమేని మనముకూడ శాపమునుండి విడుపబడినవారమై దివ్యత్వమును పొందగలము. మహారాజును వాసవీకన్యకయొక్క శాప మహిమచే మన ప్రాణత్యాగము వినిన మరుక్షణమందే తల పగిలి మరణింపగలడు" అని గతాగతమగు చరిత్ర నెల్ల తెలియజేసెను.

## కుసుమశ్రేష్ఠి పూర్వజన్మ కథ

భాస్కరాచార్యులవారు మఱియు నిట్లు విశదీకరించిరి:—

వర్తకపుంగవులారా! ఇంకను, యింకొక్క రహస్యము కూడ గలదు. అదేమనగా, పూర్వకాలమున అనగా కృతయుగాం

తమున "సురథుడు" అను మహారాజును, "స మా ధి" యను వైశ్యపుంగవుడును జగన్మాత యగు పరమేశ్వరింగూర్చి తపంబు గావించిరి. అందు సురథుడు దేవ్యానుగ్రహమువలన, సావర్ణిక మనువై స్వర్గసుఖము లనుభవించుచున్నాడు.

ఇక "సమాధి" యను వర్తక పుంగవుడు దేవి ప్రత్యక్షము కాగా యిట్లు వేడుకొనెను. "అమ్మా ! పరమేశ్వరీ ! అశ్వరమగు సంసార తాపత్రయమునుండి రక్షించి శాశ్వతమైన బ్రహ్మత్వమును ప్రసాదింపుము. మఱియు నా వలన పితృవంశస్థులు, మాతృవంశస్థులు, మేనత్త వంశస్థులు, పినతల్లి (తల్లిచెల్లెలు) వంశస్థులు, మామగారి వంశస్థులు, చెల్లెలివంశస్థులు, కూతురు వంశస్థులు అయిన 102 గోత్రములవారును తరించి బ్రహ్మపదవి పొందునట్లు అనుగ్రహించుము'' అని వేడికొనెను.

అప్పుడు పరమేశ్వరి సమాధిని జూచి ''నాయనా ! నీ కోరిక తీరగలదు, కాని, ఇప్పుడు కాదు. కాలక్రమమున నీవు "కుసుమశ్రేష్ఠి"నామాంతరమున భూలోకమున నవతరింపగలవు. అప్పుడు నేను నీకు కుమారితగ జన్మించి ''వాసవి కన్య" నామమున మీకు కులదేవత నగుదును. ఆ సందర్భమున నీవు కోరిన 102 గోత్రములవారును నాతో బాటు అగ్నిప్రవేశము కాగలరు. తత్ఫలితముగా వారందరికి, తదుపరి వారి గోత్రోద్భవులకు బ్రహ్మసాయుజ్యము లభింపగలదు. వారి కీర్తి సూర్యచంద్రులు ఉన్నంతకాలము చిరస్థాయిగా నుండగలదు" అని దీవించి అంతర్హిత యయ్యెను.

"కావున మీరు వెనుకంజవేయక, స్వమతాభిరక్షణకొఱకై దేవ్యాదేశానుసారముగ ప్రాణత్యాగ మొనరించి దివ్యత్వమును పొంది, మీ కీర్తి నిలుపుకొనుడు" అని భాస్కరాచార్యుల వారు వివరముగ తెలియజేసిరి.

ఇట్లు భాస్కరాచార్యులవారు చెప్పిన కథ నాలకించి 102 గోత్రములవారు మాత్రము తమ కులధర్మమును నిలబెట్టుట కొఱకును, దివ్యత్వమును పొందుటకొఱకును వాసవాంబతో అగ్ని ప్రవేశ మొనర్చుటకు సిద్ధపడిరి.

అధిక సంఖ్యాకులగు 612 గోత్రములవారు మాత్రము అందులకు సమ్మతింపలేదు. భాస్కరాచార్యులవారు చెప్పినదెల్ల ఒక కట్టుకథ యని తలంచుటవలనను, మరణమునకు భయపడుట వలనను వారు అగ్నిప్రవేశ మొనర్చుటకు సమ్మతింపక పోయిరి. అంతియేగాక, ఉత్సాహవంతులను నిరుత్సాహవంతులుగా చేయుటకు పూనుకొనిరి.

## భాస్కరాచార్యులవారు వాసవాంబను సభకు పిలిపించి ఆమె తలంపు తెలిసికొనుట.

అప్పుడు భాస్కరాచార్యులవారు కొంత నిదానముగ యోచించి కుసుమశ్రేష్ఠిని గాంచి "ఇంతవరకు మనలో మనమే అన్నియు నాలోచించుకొనుచుంటిమే గాని వాసవీకన్యక యొక్క

మనస్సు ఏ విధముగా నున్నదో కొంచెమైనను విచారింపలేదు. కావున ఈ సభయందే వాసవాంబ ఉద్దేశముకూడ తెలిసికొనుట మంచిదని నా తలంపు. ఆమెకోరిక ఎట్లున్నదో తెలిసినపిమ్మట గదా ! మనము కార్యరంగమునకు దూకుట?" అని ప్రశ్నించెను. ఆ మాటలకు సభాసదులుకూడ సమ్మతిని చూపుటవలన కుసుమ శ్రేష్ఠి వెంటనే వాసవాంబ యచ్చటకు వచ్చుటకై తగిన ఏర్పాటు గావించెను.

వాసవాంబ తండ్రియానతి తలదాల్చి సకాలమునకు సభా మండపమునకు చేరుకొని, గురువునకు, తండ్రికి, తదితర పెద్దలకు వందనము గావించెను. అప్పుడు భాస్కరాచార్యులువారు ఆమెకు నడచిన కథ యంతయు తెలియజేసి "అమ్మా ! నీవు పసిబాలవు కాదు. యుక్తాయుక్తముల నెఱిగినదానవు. కావున నీవు బాగుగా ఆలోచించుకొనుము. నీ తలంపునకు మేము వ్యతిరేకముగా నడచు వారముకాము. నీ యోచనమీద పై కార్యక్రమమును నడిపింప వచ్చును" అని పలికెను.

అప్పుడు వాసవాంబ భాస్కరాచార్యులవారిని జూచి, "మహాత్మా ! మీరు నాకు తెలియ జేయకపోయినను నేను జరుగు చున్న కథ అంతయు గమనించుచునే యున్నాను. అన్యేతరుని చేబట్టి కులమున కెల్ల మచ్చ దెచ్చునంతటి చపలచిత్తురాలను కాను. ఇంతగా రచ్చ కెక్కిన నా యీ జీవితముమీదనే నాకు తీపి

లేదు. సెలవైనచో నగ్నిగుండమున బడి ప్రాణములు వీడవల యునని యున్నది. మదోన్మత్తుడగు ఆ మహారాజు యిటకు రాక ముందే నే నగ్నిప్రవేశ మగుదును. నా యీ తలంపు నెరవేరు టకు నన్ను ఆశీర్వదింపుడు. ఇంతకంటె నేను చెప్పవలసిన దేమియులేదు" అని పలికెను. ఆమె నిర్ణయమునకు గురువును, తలిదండ్రులును, 102 గోత్రములవారును మిక్కిలి ఆనందించిరి. తుదకు వాసవాంబతో సహా 102 గోత్రములవారు కూడ కులధర్మ ములను కాపాడుకొనుటకై అగ్నిప్రవేశము చేయుటకు తీర్మానించు కొనిరి.

## వైశ్యపుంగవులు 103 అగ్నిగుండములు తయారుగావించి వాసవాంబతోసహా అగ్నిప్రవేశ మగుట.

ఆ మఱునాటికి మహారాజు పంపిన రాజభటులు పెక్కు మంది వచ్చి పెనుగొండ పట్టణమును ముట్టడించిరి. అప్పుడు వైశ్యులు తమ ప్రయత్నమునకు వీరడ్డుపడుదురను తలంపున వారిని ఉపాయముచే మోసగింప దలచి కొందఱు వేశ్యలకు బహు మతు లిచ్చి ఆ రాజభటులవద్దకు బంపించిరి. ఆ వేశ్యకాంతలును వారిని తమ మోహపాశముతో బంధించి పట్టణములోని వార్తల నేమియు వానికి తెలియనీయక క్రీడాసల్లాపము లొనర్చుచుపట్టణము వెలుపలనున్న వనమునందు నివసింపసాగిరి.

వైశ్యపుంగవులును తమ నిర్ణయము ప్రకారముగా 103 అగ్నిగుండములు శ్రీ నగరేశ్వరస్వామి దేవాలయమునందునిర్మింప జేసిరి.

ఆరోజు మాఘ శుద్ధ విదియా భానువారము. అది మహారాజు పెండ్లిప్రయత్నమున వచ్చు దినము. కావున అతడు వచ్చుటకు లోపలనే "మనము అగ్నిప్రవేశము కావింపవలయు"నని వైశ్యరత్నము లెల్ల నిర్ణయించుకొనుటచే 103 అగ్నిగుండములను బాగుగా అలంకరించుకొనిరి. అందులో మంచిగంధపు చెక్కలను నింపిరి. నాడు పట్టణము కూడ బాగుగా శృంగారింపబడెను. ప్రతి గృహమును పచ్చని తోరణములతో కళకళ లాడుచుండెను. అట్టి సమయమున 102 గోత్రజులయిన వైశ్యులు పట్టణ మంతయు నూరేగి వచ్చి శ్రీనగరేశ్వరస్వామి ఆలయము చేరుకొనిరి.

అప్పుడు గురువులగు భాస్కరాచార్యులవారు వారందరికి వీరతాంబూలము లొసగిరి. అప్పు డందరు ఏకైక కంఠముతో శ్రీ నగరేశ్వరుని కడసారిగా ప్రార్థించుకొనిరి. తరువాత వాసవాంబయు, ఆమెయందును కులమునందును అభిమానముగల 102 గోత్రములవారును ఆమెతో దగ్ధమగుటకు సంసిద్ధులైరి. తక్కిన 612 గోత్రములవారును తిరుగుమొగము బట్టిరి. తనతో అగ్ని ప్రవేశ మగుటకు సిద్ధపడిన వారి నందర నొక్కసారిగ జూచు

నప్పటికి వాసవాంబకు వారిపై కరుణయు, మహారాజుపై క్రోధ మును కలిగెను.

"ఎవనిమూలముగా సద్వంశజులగు ఈ 102 గోత్రముల వారు మరణింప సిద్ధపడినారో, ఎవని మూలముగా నా జీవితము నిరర్థక మగుచున్నదో, ఎవడు ఈ నాశనములకు మూలకారణుడో అట్టి ఆ మహారాజు మా యీ అగ్నిప్రవేశపువార్త వినినవెంటనే తల పగిలి మరణించుగాక!" అని శపించెను. పిదప వైశ్యులను తిలకించి "నాతో నిట మరణమునకు సిద్ధముగా నున్న ఈ 102 గోత్రముల వారును ఈ యిల సూర్యచంద్రు లున్నంతకాలము వృద్ధి పొందుదురుగాక!" అని యనుగ్రహించెను. అప్పుడు పర మేశ్వరుడగు శంకరుడు ప్రత్యక్షము కాగా, వాసవీ కన్యక ఉమా పతిం జూచి సాష్టాంగ నమస్కారములు గావించెను. శంకరు డామెను సాదరముగ లేవనెత్తి తన తొడపై కూర్చుండబెట్టు కొని అగ్నిగుండ మధ్యమున ప్రకాశించెను. అప్పుడా యానంద కరమైన దృశ్యమును తిలకించి వైశ్యప్రముఖులెల్ల వారి నిట్లు నుతించిరి.

## శివ స్తోత్రము *

"శంకర! భక్తవశంకర! భవనా
శంకర! పాలిత కింకర! మా
సంకట ముల నకలంక మనంబున
క్రుంక జేయుమా! విజయంకర! ॥ఓ॥ శం॥

* ఇందలి పాటలు, పద్యములు మిత్రులు శ్రీ బూరెల సత్యనారాయణ మూర్తిగారిచే వ్రాయబడినవి.

౨

ఈశ్వర ! ఓ సర్వేశ్వర ! అగ
స్త్యేశ్వర ! విశ్వాపోషక ! మమ్
అశ్వరమగు నీ విశ్వమునుండి
విశ్వరూప తప్పింపుము ఈశ ॥ శం॥

౩

శశిధర ! శంకర ! పాపభయంకర!
సాంబసదాశివ ! ఓ శంభో !
శార్వాణీ హృదయాధివాస ! బ్రం
దారకాదివందిత! శివ ! శంభో॥ శం॥

౪

నిత్యస్వరూపా ! నిరాకార ! యో
నిటలాక్ష ! ఓ గౌరీశా !
సత్యమూర్తి సన్మందిర వాసా
శాంత చిత్త ! సర్వేశ ! మహేశా ! శం॥

ఇట్లు మహేశ్వరుని స్తుతించి, పిమ్మట వాసవీకన్యయైన పరమేశ్వరిని గూర్చి యిట్లు స్తోత్రము గావించిరి.

## పార్వతీ స్తోత్రము

శ్రీ హిమవన్నగ పుత్రీ ! సుచరిత్రీ !
శ్రితజన నేత్రీ ! పార్వతీ ! ॥శ్రీ॥

౧

చాముండేశ్వరీ ! ఈశ్వరి ! దుర్గ
శాంభవి ! శ్రీ రాజేశ్వరీ !
హైమావతి ! త్రిపురాసుర మర్దనీ !
అంబా! సుగుణకదంబా ! ||శ్రీ||

౨

నాట్యకళామూర్తీ ! వాసవీ
నామాంకిత రూపీ !
నటరాజసతీ ! నయనోల్లాసీ !
నతజన పోషిణి ! నవరసభాషిణీ ! శ్రీ||

౩

త్రిజగన్మోహినీ ! త్రిభువన జననీ !
త్రిపురాంతకురాణి ! భవానీ !
లోకేశ్వరి ! శాంకరి ! ఓంకారీ !
శ్రీకరి ! శుభకరి ! దైత్యభయంకరి! శ్రీ||

౪

జ్యోతిర్మయమూర్తీ ! శ్రీ సతి !
సూనృతపథవర్తీ !

శోభనమూర్తీ ! సుందరగాత్రీ !
శుభదాయకి ! ముల్లోక నివాసిని ॥శ్రీ॥

వారిస్తోత్రములకు పార్వతీపరమేశులగు నా పురాణ దంపతులు మిక్కిలి హర్షించిరి. ఇట్లు వాసవికన్య 102 గోత్రముల వారు తన్ననుసరింపగా అగ్నిగుండముల బడి పవిత్రమై పరమేశ్వరి యై 102 గోత్రజుల యొక్క సంతానమునకు వైశ్యకులాచార ధర్మములను బోధించెను. అప్పుడు ఈశ్వరుడు వైశ్యుల నందరిని అనుగ్రహించి వాసవాంబతో కైలాసమున కేగెను. 102 గోత్రజులును శాపవిమోచనులై కైలాసవాసు లయిరి. వైశ్య పుత్రులు తమతమ తల్లిదండ్రులకు ఆనందముతో అంత్యక్రియలు జరిపిరి.

ఆనాటి నుండి ఈ నాటివరకు వైశ్యకులశిరోరత్నమగు శ్రీవాసవీకన్యక "కన్యకా పరమేశ్వరి"గా ప్రతియింటను వెలసి పూజింపబడుచున్నది.

అధర్మమార్గ మభిలషించిన విష్ణువర్ధనుడు పెండ్లికి తరలి వచ్చుచు - శ్రీవాసవీకన్యకయొక్క శాపమహిమవలన ఆమె స్థితి తెలిసిన మరుక్షణమందే తల వేయి వ్రక్కలై మరణించెను. ఇట్లు గంధర్వునకు కూడ శాప విమోచన మగుటవలన ఆతడు తన లోకమున కరిగెను.

ద్వితీయభాగము ముగిసినది.

# నిత్యము పఠింపదగిన శివస్తోత్రము

"అబ్ తేరెశివా" అను మాదిరి.

శ్రీ శైలసుతా, హృదయేశ ! పాపవినాశా !
చిద్రూప ! ఈశ ! సర్వేశా ! దివ్యప్రకాశా ॥శ్రీ॥

౧

చంద్రకళాధర ! ఈశా ! తమః ప్రకాశా !
ఇంద్రాదిదేవనాథ వినుత ! ఓ జగదీశా !
ఓ మంజు భాష !
ఓ మంజుహాస ! మధురహాస ! ఓ పరమేశ !
సమ్మోద మలర మము బ్రోవరా ! లోకేశా ॥శ్రీ॥

౨

శూలాయుధకర ! త్రిపురాసురహర ! రారా !
నీలగళా ! కైలాసాచల సంచారా !
కరుణాప్రపూర !
కరుణాప్రపూర ! శంకర ! భక్తాత్మవిహారా !
గురునాథ ! బ్రోవగరార ! ఆత్మవిహారా ॥శ్రీ॥

౩

కారుణ్యాకర ! నందీ, భృంగీశ్వరులున్
గణుతించెడి, నారద హృదయాధి నేతవు;
సర్వాంత ర్యామి....

సర్వాంతర్యామి, ఉమాపతీ ! దివ్యజ్యోతీ ;
పర్వేందు మౌళి ! బ్రోవగరావే ! సంప్రీతీ ! ॥శ్రీ॥

## 2

"కస్తూరి రంగ రంగా" అను మాదిరి.

దేవాది దేవ దేవా! మముబ్రోవ ! దీనబాంధవ ! రాగదే !
భావమున నిన్నెంచితీ! సర్వేశ! పార్వతీనాథ ! ఈశ ॥దే॥

౧

ఏడేడు లోకములకు । దొరవౌచు । ఏలుచున్నావు తండ్రీ
ఏరీతి నిన్నుగొల్తు । పరమేశ ! ఈశ్వరా ! కన్నతండ్రీ ! ॥దే॥

౩

నందివాహనుడ వీవు । పరమాత్మ ! నాగభూషణుడ వీవు
వందితామరుడ వీవు । విశ్వేశ ! వనమాలినుతుడ వీవు ॥దే॥

౪

ఫాలలోచనుడవీవు । గౌరీశ ! నీలకంధరుడ వీవు !
కైలాసవాసు డీవు । జగదీశ ! కామితార్థుండ వీవు ॥దే॥

౫

కామమదహరణుండవు । దుష్టాళి ! గర్వభంజనుడ వీవు !
సోమార్ధశేఖరుడవు । మాపాలి । శుభకరుండవు । నేతవు ॥దే॥

౬

శివనాథ ! విశ్వనాథ ! గౌరీశ ! భవపాశనాశ యీశ !
సువిచార ! విజయంకర ! కైలాస । వాస ! పరమేశ ! ఈశ ! దే॥



అగ్నిప్రవేశ మైన 102 గోత్రములవారి నామములు
ఈ పత్రిక పేజీలలో వివరింపబడినవి.

| వరుస నెం. | గోత్రనామము | ప్రవర గోత్ర నామము | ఋషి నామము |
|---|---|---|---|
| 1 | ఉద్వాహాకుల ( పెండ్లికుల ) శ్రీవాసవీకన్యక పుట్టింటి వారి గోత్రము | 1 రవిశిష్టకుల | ప్రభాతముని |
| 2 | మధనకుల(మిధనకుల) (మిధునకుల) శ్రీ వాసవీకన్యక మేనమామల గోత్రము | 1 మైత్రికుల (మధ్యకుల)మద్దికుల | మైత్రేయముని |
| 3 | మునికుల | మూలకుల 2 నాభీలసకుల(నాబిళ్ల) | మౌద్గల్యముని |
| 4 | హరిశిష్ట (అరశిష్ట) | 1 యరశిష్ట (ఎలశిష్ట) | ఆత్రేయముని |
| 5 | కపటకుల (కౌటకుల) (కోటకుల) | 1 కర్ణాటకుల (కర్ణకుల) | కణ్వముని |
| 6 | ఇంచుపకుల | 1 ఘోంటకుల | గోపకసముని |
| 7 | ఉపమన్యకుల | 1 ఉలాలకుల 2 ఉపనకుల | వామదేవముని |
| 8 | ప్రాలేపకుల (పోత్రలేఖకుల) పోత్రిలికుల | 1 పుంసిమానుల కుల | పౌండ్రకముని |
| 9 | చింత్యకుల | 1 చింతాలకుల 2 చింతమశిష్ట | సత్యవ్రతముని |
| 10 | చంద్రకుల | 1 చంద్రశిష్ట 2 చంద్రమూల | జతకర్ణముని |

| అగ్నిప్రవేశ మొనర్చిన భార్యాభర్తల నామములు | | వర్జనీయ వస్తువులు | గోత్రముల వివరము |
|---|---|---|---|
| భార్య | భర్త | | |
| అభిరామ | రామచంద్రాచార్యులు | బొద్దికూర కుసుమ ధాన్యము | . . |
| భ్రమరాంబ | బాలార్క శ్రేష్ఠి | మొగలి, బెత్తం జిల్లేడు | . . |
| రాజముఖి | రాజేంద్రగుప్త | మునగ, కస్తూరి | . . . |
| రాజ్యలక్ష్మి | ద్రవిణ రాజాచార్యులు | గానుగ ఎఱ్ఱఅవిసె బెత్తము | . . . |
| సమదర్శిని | సోమశేఖరాచార్యులు | తెల్లకంది మల్లెపువ్వు | . . |
| కీర్తికాంత | ఉత్పలాక్షాచార్యులు | ఎండుపోక తెల్లకలువ | . . |
| భీమాంబ | పృథ్వీపతి గు॥ | పిప్పలి, మాదీఫలం | . . . |
| పుష్పాంబ | భువనాధిప గు॥ | నల్లజీడి, కుంకుమ, పొన్న పువ్వు | . . . |
| చిత్రభాషిణి | చిత్తశుభగాచార్యులు | చింత, అల్లం, చిత్రమూలము | . . . |
| బాలామణి | బలదేవ గు॥ | శంఖుపూస లత్తుక, చందనము. | . . . |

| ప్రవర గోత్ర నామము | ఋషి నామము | అగ్నిప్రవేశ మొనర్చిన భార్యాభర్తల నామములు | | వర్జనీయ వస్తువులు | గోత్రముల వివరము |
|---|---|---|---|---|---|
| | | భార్య | భర్త | | |
| 1 పాగ్గ్వాలకుల (పాంచాళ) 2 ప్రాణశీలకుల (ప్రాణుసుల) 3 కమధేనుకుల (కమతకుల) | పరాశర్యముని | పల్లవాంబ | పాలాహ్వాయ గుప్త | కర్జూరము కర్పూరం, మొగలి, నిమ్మ | •••• |
| 1 శ్రీరంగకుల | శ్రీవత్సముని | రాగ మంజరి | రాగయ్య గు॥ | పొన్నపువ్వు చిటికూర | •• |
| 1 వకశిష్ట 2 వ్రక్కాల | వాయువ్యముని | నారీమణి | నాగయ్య గు॥ | తవాలు, వావింట్లు | ••• |
| 1 దయశిష్ట | దేవలముని | ధనలక్ష్మి | ధనరార్యులు | దేవదారు, దాడిమఫల | •• |
| 1 గోశీల 2 ఉత్తమగోశీల 3 పల్లవగోశీల 4 పటుగోశీల 5 సత్యగోశీల 6 భీమగోశీల 7 శ్రీగోశీల 8 నందిగోశీల 9 సూర్యకుల | పౌలస్యముని | రుక్మావతి | పావనయ్యగుప్త | తెల్లపట్టు, పులిగోరు దేవకాంచనం, పునుగు | ••••• |
| 1 తుర్యాటకుల 2 తులశిష్ట | పూతికర్ణముని | చంద్రముఖి | పూతాత్మార్యులు | ఎర్రతోటకూర, అరటికాయ | •• |
| 1 ఉతశిష్ట | అంగిరసముని | ధర్మాంబ | ఉత్తమయ్య గుప్త | ఉత్తరేణి | •• |
| 1 చరకుల 2 శ్రేష్టకుండల కుల | నారదముని కందర్పముని (కాంచనముని) | అమృత భాషిణి | గౌతమార్యులు | శ్రీగంధం, కుంకుమపు। మాదీఫలం | •• |

| క్ర. సంఖ్య | గోత్రనామములు | ప్రవర గోత్ర నామము | ఋషి నామము | అగ్నిప్రవేశ మొనర్చిన భార్యాభర్తల నామములు | | వర్జనీయ వస్తువులు | [illegible] |
|---|---|---|---|---|---|---|---|
| | | | | భార్య | భర్త | | |
| 19 | సనకుల | 1 శానకుల | సనకసనందనులు | పల్లవాంబ | మల్లయ్య గుప్త | జాజికాయ | • • |
| 20 | మన్న్యకుల | 1 మానాథకుల | మాండవ్యముని | విచక్షణాంగి | దక్షిణయ్య గుప్త | ఎర్రవస్త్రం | • • |
| 21 | అనపకుల | 1 అనుపాలకుల | అగస్త్యముని | చంద్రరేఖ | శృంగధామ గుప్త | (మానిపస్పు) అనుములు | • • |
| 22 | దంతకుల | 1 ద్యంతకుల | సుతీక్ష్ణముని | జాహ్నవి | జామదగ్ని గుప్త | తెల్లకలువ అనుములు, | • • |
| 23 | చెన్నకుల (చన్నకుల) | 1 జానుకుల | జరత్కారముని | కళావతి | చంద్రయ్య గుప్త | జమ్మి కర్పూరము | • • |
| 24 | ఘంటస్థూలకుల (ఘంటాసులకుల) (ఘంటసుల) | 1 గణపకుల | పల్లవసముని | నీలాంబ | నందయ్య గుప్త | జవ్వాజి. అరటిపండు చెంగల్వ | • • |

| ప్రవర గోత్ర నామము | ఋషి నామము | అగ్నిప్రవేశ మొనర్చిన భార్యాభర్తల నామములు | | వర్జనీయ వస్తువులు | [illegible] | [illegible] |
|---|---|---|---|---|---|---|
| | | భార్య | భర్త | | | |
| 1 శానకుల | సనకసనందనులు | పల్లవాంబ | మల్లయ్య గుప్త | జాజికాయ | • | • |
| 1 మానాభకుల | మాండవ్యముని | విచక్షణాంగి | దక్షిణయ్య గుప్త | ఎఱ్ఱవస్త్రం ప్రమానిపస్పు | • | • |
| 1 అనుపాలకుల | అగస్త్యముని | చంద్రరేఖ | శృంగధామ గుప్త | అనుములు తెల్లకలువ | • | • |
| 1 ద్యంతకుల | సుతీక్ష్ణముని | జాహ్నవి | జామదగ్ని గుప్త | అనుములు, జమ్మి | • | • |
| 1 జానుకుల | జరత్కారముని | కళావతి | చంద్రయ్య గుప్త | కర్పూరము జవ్వాజి. | • | • |
| 1 గణపకుల | పల్లవసముని | నీలాంబ | నందయ్య గుప్త | అరటిపండు చెంగల్వ | • | • |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ప్రటనకుల | దాల్భ్యముని | పల్లవపాణి | వల్లభేంద్ర గుప్త | పాలపండ్లు | • | • |
| | ఋశ్యశృంగుడు | అనుమిత్ర | ఆనందగుప్త | అలచన్దలు | | • |
| | పింగళమహర్షి | పోతమాంబ | భోగయ్యగుప్త | అవిశకూర | | • |
| | అశ్వలాయనమ॥ | విమలాంగి | కపిలాచార్యులు | అత్తిపండు గరికి | | • |
| | యాజ్ఞవల్క్యమ॥ | అభినవాంబ | అమలాచార్యులు | నవరత్నము అల్లికాయ | | • |
| | స్థూలశిరస్కముని | తారకావళి | వామనార్యులు | స్ఫటికం, బిచ్చలి | | • |
| | పౌండరీకముని | కనకాంగి | కుముదయ్య గుప్త | ఎఱ్ఱముల్లంగి, కుంకుడు | | • |
| | సౌందర్యముని | ఇందుముఖి | విందయ్య గుప్త | ఎఱ్ఱికలువ చెంగల్వ | | • |
| | విష్ణువర్ధనముని | కమలావతి | గజసత్వయ్య గు॥ | ఇంగువ, కొబ్బరి. | | • |

| క్రమ సం. | గోత్రనామము | ప్రవర గోత్ర నామము |
|---|---|---|
| 34 | ఇక్ష్వాకుకుల | |
| 35 | వుసిరికుల (ఉశీరకుల) | |
| 36 | కరకపాలకుల | |
| 37 | కామశిష్టకుల | |
| 38 | క్రమశిష్టకుల | |
| 39 | కన్యకుల | |
| 40 | కొరట కుల (కురట కుల) | |
| 41 | కుమార శిష్ట | |
| 42 | గుణముఖకుల (గణముఖకుల) | |
| 43 | గ్రంధిశిల | |
| 44 | ఘనశ్రీలకుల | |
| 45 | చందకుబి (చందకకుల) | |
| 46 | శని శిష్ట (చనశిష్ట) | |
| 47 | ఉపరకుల | |
| 48 | చక్రమూళకుల (చక్రమూలకుల) | |

| ఋషి నామము | అగ్నిప్రవేశ మొనర్చిన భార్యాభర్తల నామములు | | వర్జనీయ వస్తువులు | క్షేత్రము దర్శనము |
|---|---|---|---|---|
| | భార్య | భర్త | | |
| మహాతేజస్క మహర్షి | చంచలాక్షి | పావనయ్యగుప్త | మంకెన పు॥ చెఱకు, తామరఇంగువ | ♦ |
| దైవల్యముని (హరివక్త్రముని) | భ్రమరాంబ | దంతునామార్యులు | ఉసిరికాయ రేగుపండు | ♦ |
| కౌశికముని | మంజువాణి | సుందరయ్యగుప్త | జిల్లెడు | ♦ |
| కౌంతేయముని | అర్కమాంబ | అమలయ్య గుప్త | కన్దమూలం | ♦ |
| శరభంగముని | కుందరదన | గోవింద గుప్త | కందమూల | ♦ |
| ఔతృషముని (ప్రమదముని) | అబ్జముఖి | జామదగ్నిగుప్త | ఎ॥ముల్లంగి | ♦ |
| హరివల్కముని (మతంగముని) | కమలాక్షి | సమధయ్యగుప్త | గుమ్మడి, గురివెంద | ♦ |
| ఉగ్రసేనమహర్షి | ధరణీదేవి | కుమార గుప్త | గోరింటాకు తెల్లకలువ | ♦ |
| కాశ్యప ముని | హల్లకాంబ | పార్థివార్యులు | వాడగనేరు | ♦ |
| గౌతమముని | ధనలక్ష్మి | ధనంత గుప్త | దేవకాంచన పువ్వు | ♦ |
| కౌండిన్యముని | లోలాంబ | లోకయ్య గుప్త | గురుగు కాయలు | ♦ |
| జాంబసూదనము॥ (ధౌమ్య ముని) | కమలావతి | గౌరయ్య గుప్త | తెల్లచెరుకు నెమలిపురి | ♦ |
| శాండిల్యముని | సౌదామిని | బంభరార్యులు | చీమజాజి కాయ | ♦ |
| చంద్రమౌళిమ॥ త్రైజట ముని | చంద్రకళ | చంద్రమౌళిగుప్త | భుజపత్రి | ♦ |
| చక్రపాణి ముని | తనుమధ్య | ధృతసత్వ గుప్త | చక్రవర్తి కూర మఱ్ఱిపీడ | ♦ |

| క్రమ సం. | గోత్రనామము | ప్రవర గోత్ర నామము |
|---|---|---|
| 49 | చిద్రూపకుల (చిదురుపేళ్ళ) | |
| 50 | చందోనుకుల | |
| 51 | తంకారకుల | |
| 52 | త్రిమాలకుల | |
| 53 | త్రివిక్రమశిష్ట | |
| 54 | తుప్పాలకుల | |
| 55 | తృకశిష్టకుల | |
| 56 | దేంతకుల | |
| 57 | దీక్షమకుల | |
| 58 | దూర శిష్టకుల | |
| 59 | ధనగుండకుల | |
| 60 | ధనకుల | |
| 61 | పద్మశిష్ట | |
| 62 | పైడికుల (ప్రహిణుకుల) | |
| 63 | పాలకుల | |

| ఋషి నామము | అగ్నిప్రవేశ మొనర్చిన భార్యాభర్తల నామములు | | వర్జనీయ వస్తువులు | స్త్రీలకు పురుషులకు |
|---|---|---|---|---|
| | భార్య | భర్త | | |
| పవిత్రపాణిముని | సుదర్శని | సౌదయ్యగుప్త | చామంతి చిత్రికూర | ♦ |
| నేత్రపాదసముని | సుబోధిని | సింహసేనార్యులు | సంపెంగ పుష్పము | ♦ |
| సనత్కుమారమ॥ | మోహిని | పవిత్రపాణిగుప్త | గోధుమలు | ♦ |
| మాధవుముని | మోహనాంగి | సుందరార్యులు | అనపకాయ కర్పూరము | ♦ |
| తరుణస ముని (త్రిజటముని) | బాలమణి | జనార్ధనగుప్త | బూ॥గుమ్మడి తె॥గురింద | ♦ |
| తుంబరుముని | దంతవతి | అమృతయ్యగుప్త | పిప్పలి ధాసనిపువ్వు | ♦ |
| శౌనకసముని | సమశీల | సకలయ్యగుప్త | తుమ్మికూర ఎ॥కామలు | ♦ |
| దూర్వాసనముని | చిత్రరేఖ | కుశలయ్య గుప్త | టెంకాయ | ♦ |
| మరీచస ముని | బాలమణి | భాస్కరార్యులు | ద్రాక్షపండ్లు | ♦ |
| జడభరత ముని | మణిమంజరి | ఆదిత్య గుప్త | నిమ్మపండ్లు గోరోజనం | ♦ |
| వ్యాసన ముని | ధనవతి | ధరయ్యగుప్త | దానిమ్మ పువ్వులు | ♦ |
| కార్ష్ణస ముని | శ్యామలాంబ | కృష్ణయ్యగుప్త | ఉత్తరేణి అన్నకాయ | ♦ |
| మౌనిరాజసముని | సరస్వతి | సరసయ్యగుప్త | తామరకూర | ♦ |
| గార్గ్యస ముని (అంగీరసముని) | కాశీవతంస | కాలకంఠ గుప్త | కాకర కరక్కాయ | ♦ |
| నారదసముని | హేమవతి | స్వర్ణరధయ్యగు॥ | మాదీఫలం చిలుక | ♦ |

| వరుస సం. | గోత్రనామములు | ప్రవర గోత్ర నామము |
| --- | --- | --- |
| 64 | పిప్పలికుల (పుప్పాలకుల) | |
| 65 | పుచ్ఛకుల, పుపీతకుల | |
| 66 | పృథ్వీశిష్ట | |
| 67 | శ్రీపుంసిక | |
| 68 | ప్రౌఢయాజకుల | |
| 69 | పేరుశిష్ట | |
| 70 | బలిశిష్ట | |
| 71 | పెద్దశిష్ట | |
| 72 | బుదురుకుల (బుధరుక్యకుల) | |
| 73 | బుధనకుల (బుద్ధికుల) | |
| 74 | భ్రమరకుల (భమరకుల) | |
| 75 | భీమశిష్ట | |
| 76 | పృధ్వీకుల | |
| 77 | మండకుల | |
| 78 | మాసాంతకుల | |

| ఋషి నామము | అగ్నిప్రవేశ మొనర్చిన భార్యాభర్తల నామములు | | వర్జనీయ వస్తువులు | [illegible] |
|---|---|---|---|---|
| | భార్య | భర్త | | |
| పేశలాడు ముని | మణిశలాక | కందర్పగుప్త | తెలగపిండి గజపిప్పలి కమడిచెట్టు | • |
| సుకాంచనసము॥ | మేధాంబిక | మార్కండేయ గుప్త | తెల్ల అను ములు పుచ్చ | • |
| భార్గవ ముని (భృగు మహర్షి) | పృధ్వీదేవి | పృధువర గుప్త | నేరేడు పండ్లు. బెత్తము | • |
| పులస్త్య ముని | ధనదాంబ మానస | యోలయ్యగుప్త | తోటకూర పాలపండ్లు | • |
| మౌనల ముని | ఉల్లాసిని | పుణ్యరాశి గుప్త | పొట్లకాయ | • |
| ఆంగీరస ముని | బింబాధరి | పీనపణార్యులు | గొట్టిపెర్గ | • |
| భారద్వాజసముని | పల్లవాంబ | భోగయ్యగుప్త | బల్బుకూర | • |
| చావర్షణస ముని | హేమాంగి | మత్స్యధ్వజార్యులు | కెంపులు పచ్చపెసళ్లు | • |
| భారవ ముని | దేవాంబ | భోగయ్య గుప్త | సినమల్లె. బొద్దికూర | • |
| బోద్ధాయనసము॥ | ఇభయాన | నాగయ్య గుప్త | నిమ్మ అలచందలు | • |
| చార్గ్య ముని | భూమాంబ | బ్రహ్మయ్యగుప్త | పీతాంబరం పాలపండ్లు | • |
| వాసుదేవ ముని | విదురాంబ | మాధవార్యులు | పులిగోరు తెల్లపట్టు | • |
| జీవంతిస ముని | సోమప్రభ | సింహధ్వజ గు॥ | బట్టిపెర్గ గజనిమ్మ | • |
| కపిలస ముని | కంబుకంఠి | కపిలార్యులు | మామిడికా॥ | • |
| వరతంతుస ము॥ | వాసంతిక | అర్ధనారీశ్వరార్యులు | మినుములు | • |

| క్రమ సం. | గోత్రనామములు | ప్రవర గోత్ర నామము |
|---|---|---|
| 79 | మూరకుల | |
| 80 | మౌంజీకుల (ముంజికుల) | |
| 81 | యానసఖికుల (యనసకుల) | |
| 82 | రెంటకుల | |
| 83 | వస్త్రకుల (వస్త్రికుల) | |
| 84 | వసంతకుల | |
| 85 | వ్యాళకూళకుల (వెలగోళ్ళ) | |
| 86 | విన్నకుల (వెన్నకుల) | |
| 87 | విపరశిష్ట | |
| 88 | విక్రమశిష్ట | |
| 89 | వేనశిష్ట | |
| 90 | శ్రీశిష్ట (శిరిశిష్ట) | |
| 91 | శ్రీసోళ్ళకుల | |
| 92 | శిరిశెష్టకుల | |
| 93 | సమశిష్ట | |

| ఋషి నామము | అగ్నిప్రవేశ మొనర్చిన భార్యాభర్తల నామములు | | వర్జనీయ వస్తువులు | [illegible] |
|---|---|---|---|---|
| | భార్య | భర్త | | |
| మార్కండేయస ముని | పిప్పలాంబ | నాగధ్వజగుప్త | ఇంగువ మేడికాయ | • |
| మౌకజాయనస ముని | మంజువాణి | గుణపుంజగుప్త | మిరియాలు | • |
| ఔచిద్యస ముని | నీలవేణి | భానుర్మాణగుప్త | గోధుమలు గుమ్మడి | • |
| సంవర్తకసముని | కృష్ణాంబ | నాగయ్య గుప్త | కురువేరు | • |
| వసిష్టస ముని | పుష్పధామ | విందయ్యగుప్త | వటివేరు | • |
| వైరోహిత్యస ముని | ప్రభావతి | పద్మనాభగుప్త | కలిగొట్టు చెట్టు | • |
| జైమిని (యస్క సముని | నవనీతాంగి | విన్నయ్యగుప్త | వుసిరిక, తెల్లపట్టు | • |
| మందపాలసముని | విన్నమాంబ | విశ్వనాథగుప్త | వెదురు బియ్యం వెల్లపండు | • |
| విష్వక్సేనసముని | మేదాంశని | వీరభద్రార్యులు | వాలింటు కూర జాజిపువ్వ | • |
| విశ్వామిత్రసముని | గంగాభవాని | విందయ్యగుప్త | గంగరావి | • |
| ప్రాచీనసముని | చెరిత్రాంగి | విన్నవరేణ్యగుప్త | వెల్లపండు | • |
| వారుణసముని | సుందరి | జాముతార్యులు | దోసకాయ | • |
| శుల్లసముని | రాజముఖి | రాజేశ్వర గుప్త | కొండగోగు | • |
| శ్రీధరముని | ఉత్పలాక్షి | పండితార్యులు | కొమ్మ చనగలు | • |
| సనందనముని | పద్మగంధి | బాలభానుగుప్త | వెదురు బియ్యం | • |

| వరుస సం. | గోత్రనామము | ప్రవర గోత్ర నామము | ఋషి నామము | అగ్నిప్రవేశ మొనర్చిన భార్యాభర్తల నామములు | | వర్జనీయ వస్తువులు | [illegible] |
|---|---|---|---|---|---|---|---|
| | | | | భార్య | భర్త | | |
| 94 | సంతాలకుల | | వాల్మీకసముని | సత్యవతి | సత్యసంధార్యులు | జమ్మిపత్రి | • |
| 95 | సూరశిష్ట | | సనత్కుమారస ముని | చంద్ర మాంబ | జలదయ్య గుప్త | దొండ పండు రావిఆకు | • |
| 96 | స్నిగ్ధకుల | | సుబ్రహ్మణ్యస ముని | పరమ పావని | చంద్రభాను గు॥ | నెమలిపురి | • |
| 97 | హీరాకుల | | దేవరాతస ముని | పద్మాక్షి | మేఘసేనార్యులు | సంపెంగ పువ్వు | • |
| 98 | యలమంచకుల | | సౌచేయస ముని | చపలాక్షి | సింహముఖ ఆర్యులు | బచ్చలి యాలకులు | • |
| 99 | గుండకకుల | | శార్గ్వరవసమ॥ | మణిమాల | ఘనముఖార్యులు | మంచి ముత్యంలు మందారపు | • |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 100 | వెంకోలకుల | | కాపీతస ముని | ధన్యాస్మిని | నిర్జలసేన గుప్త | వంకాయ పగడము | ♦ |
| 101 | హస్తికుల | | సౌమ్యస ముని | లీలావతి | జనార్ధన గుప్త | గజదంతం | ♦ |
| 102 | లాభాల గోత్రము | | నరనారాయణముని | కుముదవల్లి | సుదర్శన గుప్త | మామిడీ పండు పనసపండు | ♦ |

సూచన :-

| | | | | |
|---|---|---|---|---|
| ♦ | ఒక చుక్క గుర్తు చూపబడినవి | 77 | గోత్రములు | ఏకార్షేయ గోత్రములు. |
| ♦♦ | రెండుచుక్కల గుర్తులు చూపబడినవి | 16 | గోత్రములు | ద్వార్షేయగోత్రములు. |
| ♦♦♦ | మూడు ,, ,, ,, | 7 | ,, | త్రార్షేయ గోత్రములు. |
| ♦♦♦♦ | నాలుగు ,, ,, ,, | 1 | ,, | చతురార్షేయ గోత్రము. |
| ♦♦♦♦♦ | ఐదు ,, ,, ,, | 1 | ,, | దశార్షేయ గోత్రము. |

# వైశ్యుల గోత్రముల వరుసలు చూచే వివరము

శ్రీ




౩ [illegible]యక ప్రథమంబు నారీతృతీయంబు మానుగా గూడిన మనుమరాలు
౧ పురుషుని మూడోది పూబోణి మొదటిది దనరంగ గలిసిన తల్లివావి
౩ పిల్లవానిది రెంట పిల్లది మూడింట పొసగ జేసిన నాతి పుత్రి కగును
౨ పరగ నాథుని మూట పడుచుది రెంటను అమరిన నాపె మేనత్తయగును
౨ కూడ నొకట పతి, సతి రెంట కోడ లగును
౧ వరుని రెంటను, సతి యొకటి మరద లగును
౧ పిల్ల లిద్దరు నొకటైన చెల్లెలగును
౨ వైశ్య గోత్రంబు లీ రీతి వరుస దెలిపి
౩ పెండ్లి జేసిరి తగునని పెద్ద లపుడు ॥